# అంకితము

ప్రియమిత్రుఁడు

## శ్రీ నూతక్కి రామశేషయ్యచౌదరికి

నీకనుగోనలం దొలుకు నిత్యవినిర్మలమందహాస రే
ఖాకమనీయకాంతికళికల్ పయి సోకినయంత దుఃఖతా
పాకులమైననాయెద హిమాంబుసుశీతల మౌను ; తమ్మిలే
యాకులనీడ పైకొనిన యాతపతప్తమరాళముంబలెన్

నాకును నీకు నెన్నిజననమ్ములసౌహృదమో, పరస్పరా
లోకనమందె నాబ్రతుకులో నొకతీయనిస్వప్న మేదియో
పైకొనినట్టు లయ్యె నెడఁబాయుకొలందిఁ బ్రవృద్ధినొందు స్నే
హాకృతి కాటునే యుపద లల్పము లొక్క-కృతజ్ఞతల్ వినా

నా కవితావనీ వికసనమ్మున కామనిపంటవైన సు
శ్లోకుఁడ వంచుఁ, గావ్యకళ లోతులుముట్టిన మేటిశిల్పి వం
చీ కృతి నీకొసంగితి సుహృద్వర ! కొంచెమొగొప్పొ ‘గౌతమీ
కోకిల’పాట నీయెడఁదకుం బులకింపులకాన్క లీయదే

(తొలికూర్పు)

# మనవి

తెలుఁగుతోఁటకు నవవసంతోదయమైనతోడనే కవికోకిలములు తెలుఁగునాఁడంతయుఁ జివురింపఁ బాడినవి. అందు వన్నెకెక్కిన పుంస్కోకిలములతో గానముచేసిన దీ "గౌతమీకోకిలము."

ఈ కవివతంసములు పాడిన గీతములన్నియుఁ గాకున్నను, కొన్నియైన సంపుటములుగ నచ్చుపడి నవ్యసాహిత్యభాండారమునఁ జేరినవి. కాని యీ "గౌతమీకోకిల" గీతములుమాత్రము గాలిలోనే నిలిచిపోయి రసపిపాసువుల కందరానివై పోయినవి. వానికొక కూర్పుసేకూర్చు భాగ్యమిన్నేండ్లుగడచినను తెలుఁగుభూమికిఁ గలుగలేదు. ఇందులకు రసజ్ఞులు పత్రికాముఖమున నెన్నిమాఱులో వగచిరికూడ.

శ్రీ సత్యనారాయణశాస్త్రిగారి కవిత్వమునందు నాకు గౌరవము కలదు. వారి భావనాశక్తి బలమైనది. వారు కవిసమయములను విడువ లేదు. తెలుఁగుగడ్డను బుట్టిన యుత్తమసాంప్రదాయముల నుల్లంఘింప లేదు. వారి భావకుఁ బ్రాచీనుల పటిమయున్నది. జీవితకల్లోలమునుండి యుబికినదగుటచే వారికవిత్వమునకు నిండుజీవమున్నది రసవంతమై యీ కవిత్వము సంపుటరూపము దాల్చవలసియున్నది.

కవులు తఱుచు ధనికులుకారు. సర్వము ప్రజాశ్రయము కానున్న వేళయగుటఁ గళకు రాజాదరముండవలెనన్న తొలినాఁటి మాటలకుఁ గాలము గడచినది. కళకుఁ బ్రాపుగాఁ బ్రజలు నిలుచుట బాధ్యతయే కాక ఔచితికూడనైనది. ఉత్తమకావ్య మేరసలుబ్ధుఁడైన ధనవంతునో వరించుటకంటెఁ బలువురు రసజ్ఞులపూన్కితో వెలువడుట కవికిఁ గౌరవము. ఆ ప్రజలకు గౌరవము. ఈ యూహ యాచరణయోగ్యము కావలెనని నా యుత్సాహము.

ఉత్తమకవులను సన్మానించుట వారినిగన్న దేశీయులవిధి. మహాకవు లీనాఁడు బ్రదికివచ్చిన యందలము లెత్తుదు మనుకొందురుగాని ప్రతిభగల కవులు కానునకుఁగఅవై మూల్గుచున్న నొక్క కన్నీటిచుక్కైన విడువరు. మనలోనున్న కళాభిరతులను గౌరవింప నేర్చుకొనుట నా యభీష్టము.

ఇట్టి తలఁపులెన్నో ప్రేరేపింప శ్రీ శాస్త్రిగారిని దమ పద్య కావ్యము మిత్రులసాయమున ముద్రింపనిండని కోరితిని. వారు తాము స్వయముగ గడించిన ధనముతోఁ దమ ప్రథమసంపుటము నచ్చువేయించి మిత్రులు శ్రీ నూతక్కి రామశేషయ్యచౌదరిగారి కంకితమొనర్పఁ బ్రతిజ్ఞ యని తెలిపిరి. తమకది యింతలో సాధ్యమగునదికాదని, సాధ్యమగువఱకు భీష్మించుట సమంజసము కాదంటిని. నా బలవంతమునకు మా మైత్రి పురస్కరించుకొని వా రంగీకరించిరి.

నేఁడు ఫాల్గుణ బహుళషష్ఠి; శ్రీ శాస్త్రిగారి జన్మదివసము. ఇది వారి జీవితప్రవాసమునకు రజతోత్సవసమయము కూడ. ఈ "దీపావళి" ముద్రించి నేఁడు జన్మదినోత్సవోపాయనముగా నొసఁగి పండితసమక్షమున వారిని సన్మానింపవలెనని సంకల్పము. నాయం దవ్యాజానురాగము గలిగిన మిత్రుల సాహాయ్యమునఁ గృతకృత్యుఁడ నైతిని. శ్రీ శాస్త్రి గారును సుహృద్వరులైన శ్రీ నూతక్కి రామశేషయ్యచౌదరిగారి కీకృతిని సమర్పించి యానందించిరి.

సాయమొనర్చిన మిత్రులకందఱ కీ యవకాశముగైకొని నమస్కరింతును.

కాకినాడ
ధాత
ఫాల్గుణ బహుళ షష్ఠి

కందుకూరి రామభద్రరావు

# జయగీతి

కావిముసు గల్లాడ వేకువ
కాంత దివసాంగణము చేరెను
గాలిలో వనపాళిలో సుమ
గంధ మలమికొనెన్

తరుణతరణిద్యుతుల రోదోం
తరము రంజిత మయ్యె ద్విజసం
తానగళకాహళుల ప్రాత
స్త్రవము మార్మోగెన్

తృణము తృణమున శాంతి విరిసెను
దిక్కు దిక్కుల కాంతి మెరసెను
దేవళమ్ముల మొరసె జయఘం
టావితానమ్ము

అదె త్రివర్ణధ్వజపటాంచల
ముదయపవనోచ్చలిత మయ్యెను
వదలె జయశంఖారవమ్ముల
నిదుర మైకమ్ము

వీరశౌర్యము సతుల తేజము
వేదభక్తియు సాధుదీక్షయు
వృద్ధపౌరుష మొక్క నూత్న
వేళమున వెలుగన్

కాలధూమో ద్గతమహాగ్ని
జ్వాలికామాలికలో జంఝా
నిలవిఘూర్ణిత నీలవారాం
నిధితరంగములో

వెలువడియె నా సేతుశీతా
చలము నరనారీసమూహము
నీ ప్రభాతోత్సవముహూర్తము
నేడు జనయిత్రీ!

వేదధాత్రివి జ్ఞానదాత్రివి
పేదపాలిటి యన్నపూర్ణవు
వీరరాజ్ఞీ! లేదు నీ కిక
పారతంత్ర్యమ్ము

నిన్నె చూతుము నిన్నె కొలుతుము
నీ మహోన్నతి పాడుకొందుము
నీ జయస్వాతంత్ర్యమంగళ
నిలయ దేహాళికన్

తరతరమ్ములబంధనముల వి
దల్చి నీస్వేచ్ఛాశుభోదయ
మంగళాశీః కుసుమసురభిళ
మాళివినతుల మై

కోటిగొంతుల పారతంత్ర్యో
చ్ఛాటజయగీతముల పాడుచు
నా యెదము నీ కేతనము నా
నాదిగంతములన్

ప్రాణధనమానముల పూజా
ప్రసవములుగా నీమహోజ్జ్వల
పాదపీఠిక నుంతు మమ్మా
భరతజనయిత్రీ!

జయము భారతభాగ్యధాత్రీ!
జయము వినమితపుత్రపుత్రీ!
జయము శాంతిజగత్సవిత్రీ!
జయము జనయిత్రీ!

జయము హిమగిరిమణికిరీటా!
జయము సింహళపాదపీఠా!
జయము విజయాంకితలలాటా!
జయము ప్రియజననీ!

## కాగడా

వెలిగించు కాగడా వెలిగించవోయి!
ప్రళయరుద్రుని ఫాలభాగమ్మునందు
అతని నిశాతశూలాగ్రమ్మునందు
ఆతని నేత్రగోళాంతమ్ములందు
జ్వలియించు శిఖశిఖాజాలమ్ముతోడ
వేడిగా వాడిగా వెరపుగొల్పేదిగా
వెలిగించు కాగడా వెలిగించవోయి!

రేయి విప్పిన నీలిరెక్కలనీడ
అవనీనభోంతరం బార గ్రమ్మినది
పులుగుగొంతుక మూగవోయిన వేళ
గూట నుంచిన దివ్వె కొండెక్కు వేళ
విడివ పూవులు రాలి పడిపోవు వేళ
ప్రాత దన్నది యెల్ల పైకి తోడుచును

నెమరు వేయుట పశుత్వముపాడి, గాని
సప్తసామ్రాజ్యముల్ స్థాపించుకొన్న
పరరాజ్యముల పారుపత్తెమ్ము గొన్న
పౌరుషమ్మున కది పరిపాటి గాదు
ఎన్నెన్ని కల్పమ్ము లేగిన గాని
ఆరని మారని యాధ్రువజ్యోతి
వెలిగించు కాగడా వెలిగించవోయి!

అధికారదృప్తుల కర్థమత్తులకు
భోగదాసిగ నున్న భూదేవికొరకు,
చెక్కిన నెలరాల చెరసాల నడుమ
వధ్యశిలావైభవం బిచ్చగించి
తేవులాడుచు నున్న దేవునికొరకు
దారి తప్పినబాటసారులకొరకు
దారి గానని పేదవారలకొరకు
వెలిగించు కాగడా వెలిగించవోయి!

తొడిమవీడినపూవుత్రోవ చూడదు తీవ
భూళి రాలినపండుతో పోదు పాదపము

గాలి గలసిన పాటకై పక్షి వెత పడదు
తరగ విరిగిన మహోదధి తీసిపోవదు
పశ్చిమాశా మేఘపటలాంచలముల
ముదిప్రొద్దు రేపటియుదయమ్ముకొరకు
దాచుకొన్న ప్రతాపరోచిర్జ్వాల
వెలిగించు కాగడా వెలిగించవోయి!

పూవు వీడినగాని పుట్టదు ఫలము
ఫలము రాలక జనింపదు నవాంకురము
దగ్ధదినైకచితాభస్మరాశి
సుప్తి వీడెడి యుషస్సునకు పునాది
ముదిశిశిర మ్రాకు చిదిమినపట్లు
పూలకారుచివుళ్ల పురిటిపొత్తిళ్లు
గతముకై తల పేల, క్షితి కేల వగపు
అరణి మథించి యజ్ఞాగ్ని రగుల్చి
వెలిగించు కాగడా వెలిగించవోయి!
మంటికి మింటి కన్నింటికి మంటగా
వెలిగించు కాగడా వెలిగించవోయి!

# కాంక్ష

ఈ సుమజన్మ మెట్లొ ఘటియిల్లెను నా కొకనాటిపాటిదై
వాసన లేను సోయగము వాయని తీయని సోదుముల్ క్షణం
బో, సగమో, విచారపడఁబో నయినన్ విడివడ్డ నాయెదన్
మోసులువారు నూతనమనోరథ మామని వేడిపొంగులన్

పేదల రక్తమాంసములఁ బెంపువహించి దయాసుధారసా
స్వాదదరిద్రులైన ధనవంతుల పెద్దరికమ్ముకై మతో
న్మాదము పెంచు దేవునికి మారుగ నిల్చిన రాతిబొమ్మలం
దూదరవోవు పాడుబ్రదు కొక్క నిమేషము సైప నాయెదన్

తేనెలకోసమై కొదమ తేటులదాటు లొనర్చు నృత్య గీ
తానునయమ్ము గాని, మలయానిలు కౌఁగిటఁ బుల్కరించు శా
నవ్యానుభవమ్ము గాని, తరుణారుణరాగకదుష్ణచుంబన
శ్రీఖాళమ్ము గాని పరితృప్తియొసంగవు నా కొకింతయున్

నాకుఁ దలంపు లేదు లలనాజనతాకబరీభరైకభూ
షాకలనన్, సతీమృదుభుజాంతరతల్పకుచోపగూహబి
బ్బోకమునన్, వధూసితకపోలగళచ్ఛ్రవణావతంసహే
వాకమునన్, విలాసినుల పాపటచెందిర కావిపూఁతలన్

కానుకనై ధరాధిపులకాళ్ళకడం బొరలాడి వాడిపో
లేను, ధరాపరాగపటలీమలిన మ్మగుద్వారతోరణా
స్థానమునం దురింబడఁగఁ జాలను, దోసిటిపేదఘోరకా
రానరకమ్మునం దుసురు రాల్పగ లేను నిమేషరక్తికై

నీచపు దాస్యవృత్తి మన నేరని భారత మాతృదేశసే
వాచరణమ్మునం దసువు లర్పణఁజేసిన వారి పార్థివ
శ్రీ చెలువారు చోటఁ, దదసృగ్రుచులన్ వికసించి, వాసలన్
వీచుచు, రాలిపోవగ వలెం దదుదాత్తసమాధిమృత్తికన్

# ప్రణయమూర్తి

ప్రణయమోహననీలాంబరమ్మునందు
ఱెక్కలార్చి యాషాఢవారిదము మ్రోల
ధన్యవాదమ్ము లాడు చాతకవధూటి
నాకడనె నేర్చె జీవనానందగీతి

ప్రణయహృదయానురాగవిభ్రమము వోలె
నమలతరమైన కాచపాత్రాంతరమున
వెలుఁగు దీపిక వలగొను శలభకాంత
నాకడనె నేర్చె నాత్మార్పణమ్ముకింత

పలుకఁ దెలియఁగఁ దలఁపఁగా వలనుగాక
ఆత్మను దహించు ప్రణయదుఃఖాగ్ని మండి
నీలమై వంగి వాపోవు నింగినెలఁత
నాకడనె నేర్చెఁ బ్రణయప్రణామనియతి

అని యానని ప్రణయపుష్పాసవమ్ము
ఆర్ద్రహృదయమ్ములో విరహాగ్నిఁ గొలుప
తొడిమ వీడిన పూవుకై పడుచు తేటి
నాకడనె నేర్చె విరహగీతాకలనము

అరుణరాగోదయోన్మీలితాంబుజమ్ము
చారుచంద్రకరస్మేరకైరవమ్ము
పవనపరిరంభపులకితప్రసవచయము
నాకడనె నేర్చెఁ బ్రణయహేవాకకేళి



మావితోఁపులపైఁ దొలిమబ్బునీడ
లారెడు మధుప్రవాసప్రయాణవేళ
వీడుకోలుపు పాడఁగ గొంతు విడని పికము
నాకడనె నేర్చెఁ బ్రణయమౌనప్రవృత్తి

ప్రణయతంత్రుల విశ్వవిపంచి నేను
శైలహృదయమ్ములోని నిర్ఝరము నేను
వసుమతీగర్భతలసరస్వతిని నేను
నాగళమ్మె వియోగసంయోగమురళి

# నిరీక్షణము

అనిలతరంగమాలికలయందునఁ జల్వాలఁ జల్లు తీయవా
సన పసిగట్టి యంధతమసమ్ములు మూసిన యీ నిశీథమం
దున ననుఁ జూడ నీవె దయతో నునురెక్కలఁ దాల్చి వత్తువం
చు, నిటులు వాకిలిం దెరచి చూచుచునుంటిని వీథి సారెకున్

కురులను దువ్వి, పూల్ముడిచి, గొజ్జఁగిపూవుల లేమెరుంగుటం
బరము ధరించి, గంధకలపమ్ముల మేన నలంది, కమ్మక
స్తురితిలకమ్ము నెన్నుదుట సొంపుగ దిద్ది, సువర్ణభూషణో
త్కరములఁదాల్చి ద్వారసవిధమ్మునవిల్చితి వెచ్చనూర్చుచున్

విచ్చినయట్టి బండిగురివెందపువ్వుల్ గొని తెచ్చి మాలికల్
గ్రుచ్చితిఁ బూలకన్న నతికోమలమైన భవచ్ఛరీరమే
నొచ్చునొయంచుఁజక్కఁగఁగనుంగొనికమ్మనితమ్మిపుప్పొడిన్
దెచ్చియె పాన్పుపైఁ బరచితిన్ సకలమ్మును సిద్ధపెట్టితిన్

అలికిడి యేదియైన వినినంత గవాక్షమునుండి లేచి మే
న్పులకలు దేరఁ, బాదములను న్దడబా టిగురొత్త, మారుతో
చ్చలితకదంబపల్లవముచాడ్పున నా యెద సంచలింప, న
గ్గెలఁకుల వీథియెల్లఁ బరికింతుఁ జలింప నిశాంధకారముల్

నీ యనురాగగీతికల నీ పదసన్నిధిఁ గంఠమెత్తి నేఁ
దీయగ నీవు మెచ్చుకొనుతీరునఁ బాడఁ బ్రదోషయామ మం
దే యిటు మేళవించి శ్రుతిఁ దీర్చిన వల్లకి యర్ధయామినీ
వాయుతరంగసంహతి నపశ్రుతు లీను విభిన్నతానమై

కలువలతేనెలాని వలిగాడ్పు మదాననకీర్ణ చూర్ణకుం
తలములతో సయ్యాటము లొనర్పఁగ నాచెవి నూఁదు నే మొ నీ
పొలఁకులయంచు నూర్పులెగఁబోయుదుఁ బ్రాణములోనిప్రాణమై
పొలిచిన వాని కేని దయపుట్టని దుర్విధి నాడిపోయుదున్

రేయి పదేపదే కనులరెప్పల స్వప్నపునీలిక్రొందెరల్
నేయఁ దపించు నాయెదఁ జలించినమ్రోఁతలె నీపదస్వనం
బో యని యూపి రాపి వినుచుంటిఁ జలత్తరుశాఖనీడ వా
తాయనబింబితమ్మయి త్వదాగమనభ్రమఁ గొల్ప మాటికిన్

రా వనుకొందుఁగాని యనురాగము ద్వారముమూయనీదు,దుః
ఖావహమౌను గాని భవదాదరపాత్రములంచు వేషభూ
షావళు లూడ్ప లే, నిటు నిరాశ యొకింత యొకింత యాశగా
శ్రావణలక్ష్మినై నిలువఁ జాలక యుంటిని వెల్గునీడలన్

చీకటి గ్రమ్ముకొన్న వనసీమను బూవులు రాలు చప్పుడుల్
జోక నొరంగి రాల్పడు వెలుంగునఁ జక్కవపెంటి కూయు నా
నాకరుణారవమ్ములు వినంబడ నా హృదయమ్ము దుర్నిమి
త్తాకులమౌను శంకఁ గొనినట్టి వనీమృగిగుండెపోలికన్

ప్రేమవిహీనమానసమురీతి విషాదపయోదధూమముల్
బ్రామిన యట్టి యీ భయదరాత్రి నిమేషపరాఙ్ముఖమ్ములౌ
ప్రేమవిలీనదృష్టుల వివిక్తపథమ్మును జూచుకొంచు నో
స్వామి యిఁకెంతసేపు గడపంగలనోయి! ముహూర్తకల్పముల్

# యాత్ర

పైరగాలి తరంగాలపై నపూర్వ
పరిమళవిలాసములు వెల్లివిరియసాగె
ఓ సఖి! చూడు మిరుగట్ల నొరసికొనుచు
పొంగుచున్న దానందప్రపూర మిపుడు

ముంగురులపైని పూవులు ముడువ వలదు
వలదు తిలకమ్ము; కైసేత వలదు మేన
విడిన కబరీభరము ముడివేయ వలదు
కాల మిది కాదు మనయలంకారములకు

తరతరమ్ముల ప్రేమస్వతంత్రతు లరుగు
దారిఁ బోయెడు నూతనాధ్వగుల మనలఁ
బరిహాసించెడు పాడుప్రపంచమున కె
పార వేయుము నీయలంకారభరము

మూఢవిశ్వాసశృంఖలమ్ముల విదల్చి
వలపుకౌఁగిటిముడిఁ బట్టువడితి మేని
మనశరీరసుఖస్పర్శమునకు నేఁటి
యణువణువుకూడ నవజీవ మనుభవించు

కోరికలనెల్ల మరచి, నాకొఱకు నీవు
నీకొఱకు నేను తొలివేఁగుబోఁక రాలు
పూలజతవోలె నీ సుధాపూరమందు
తేలిపోదము జన్మజన్మాలయాత్ర

## ఒక క్షణము

పండ వ్రాలినవరిపైరుపైనిఁ బ్రాకి
వచ్చు చిరుగాలితరగలవరుసవోలె
ఈ మహానందపులకితహృదయమందుఁ
బరుగులిడుచుండె వింతభావమ్ము లెన్నొ

ఇంత యానందమున కేది హేతు వనుచు
వెనుదిరిగి చూచుకొంటి___ కెంబెదవులందు
జిలుగునవ్వు జీరుకాడ నీచిగురుఁగేల
నాభుజమ్ము స్పృశించియున్నావు నీవు

ఎపుడు గుర్తించినదొ నీయదృష్టపూర్వ
భవ్యరూపమ్ము నీకరస్పర్శమాత్ర
నపుడె పులకించి పులకించి యవశమైన
నాయెద గ్రహించె నీ వాత్మనాథుఁడ వని

మఱపు దట్టిన కాలమ్ము మడతలందు
పాడువడనట్టి బహుజన్మపరిచయమ్ము
నా మలినబాష్పగుంఫితప్రేమసూత్ర
కలితమై నీపదమ్ములఁగౌఁగలించె

ప్రకృతిసౌధపు దక్షిణద్వార మంతఁ
దెరచుకొని వచ్చి మనల ఇర్వురనుగూడ
మృదులపవమాన పరిమళోర్మికలతోడ
బాధ లేకుండ బంధించి వైచి రెవరో

ఆ దృఢాశ్లేషమున భేద మంతరించి
యొక హృదయ మొక్క ప్రాణమై యున్న యపుడు
ప్రేయసీ యని ప్రాణప్రియా యటంచు
పలుకరించుకొంటిమి బాష్పభాషణముల

అపుడు నిర్మేఘమార్గశీర్షాభ్రవీథి
వృద్ధసంధ్యాతపస్విని పెదవి విరిచె
విశ్వవీణాగళము నీరవించిపోవఁ
గ్రమ్ముకొనె మృత్యుకైశికకాళిమంబు

మనము దినసంధ్యలము, కూడుకొనుచు నుందు
మొకక్షణమ్మొ ఛాయారోచిరుదయవీథి
అయిన నేమాయె, మన వియోగైక్యములనె
యొదవుఁ బ్రేమదేవతకు రేయుంబవళ్ళు

## ప్రేమ

ప్రబలతాపవిదీర్ణమై బాష్పవారి
పదనువారిన యెదఁ బ్రేమ పాదుకొనును
కళ్ళునంజీల్చి బోదెనీ గ్గట్టుకున్న
నా రెటుల నాటుకొనును కేదారమందు

# విస్మృతి

ఆ మహోన్నతధవళ శైలాగ్రమందు
ఆ యనంతపథమ్మున ఆమనోజ్ఞ
జలదవాటికఁ గేళీప్రసన్న వగుచు
నన్నుఁగని నీవు చిరునవ్వు నవ్వినావు

పశ్చిమాకాశనికషసువర్ణరేఖ
లొక టొకటి చెరపుచుఁబోవుచుండెఁబ్రొద్దు
గగనదుర్గపుఁ దూర్పుబంగారుతలుపు
తెరవఁబడియె రేరా జరుదెంచు నంచు

వసుమతీగర్భకారాకవాటములను
దెరచుకొన్న సరస్వతీఝరులు వోలె
మోహినీసాట్టహాసకోలాహలములు
పండువెన్నెల లలమె బ్రహ్మాండమెల్ల

ఆ మధురకార్తికిక చంద్రికామనోజ్ఞ
శారదవివిక్తయామినీసమయమందు
ఇరువురముగూడ, బహుకాలపరిచితులము
పోలెఁ దొలిదృష్టి నేకమై పోయినాము

వలచి విరిసిన పూవైన వాడిపోని
నవనవప్రేమపులకితానందపథము
నందు, జీవనమంగళయాత్ర బయలు
దేరితిమి తెలిమబ్బుపైఁ దార లట్లు

బంధములఁ ద్రెంచుకొని రెప్పపాటులోన
యుగయుగమ్ముల ప్రేమవియోగభార
మూర్చివైచుచు, శరదుదయోత్సవముల
మైమరచినాము లోకము మాటె మరచి

నీ భుజాబంధనముఁ గరుణించి యెపుడు
ననుఁ గరఁచితి, వపుడె సిగ్గును భయమ్ము
పొదవికొని యిట్టె నాగుండెఁ జెదరఁగొట్టి
నీ పదాంతికమందు బంధించివైచె

లలితయౌవన హృదయదళాల నెల్ల
మిగిలిపోకుండఁ దునిమి చిర్నగవుతోడ
నీ కఠిన పాదముల ధూళి సోకకుండఁ
బరచితిని నీవు నడచిన బాటలందు

పులకితహృదంతరమున నుప్పొంగిపోవు
నిండుప్రాయంపుఁ దలఁపు లన్నిటిని గోసి
దండలుగ గ్రుచ్చి నీమెడ నిండ వైచి
ప్రోడునై నిల్చినాను నీప్రోల నేను

అన్య సుఖములకై యడియాస పడక
నీ కృపాదృష్టియే నాకు నిఖిల మనుచు
జీవితసుధాకలశము చేసేత నీకు
నేనె త్రావుమటంచు నందించినాను

నీ పవిత్ర పదాబ్జసన్నిధిని నిలుచు
చనువు నొసఁగితి వంతియే చాలుననుచు
నెంత యుప్పొంగిపోయితి, నంతకంతఁ
గూలితి నధోమహాంధపాతాళమందు

ప్రేమకై జీవితమ్ము లర్పించుకొనిన
వారిదుఃఖమ్మునే కడుపార మెక్కి
వారి కన్నీటనే దప్పి నారుచుకొను
కఠినవిధికంటఁ బడియె నాగడియ బ్రదుకు

అంతమే లేని యీ యగాధాంధకార
ఘోరపాతాళకుహరాన దారిలేక
దారుణార్తారవప్రతిధ్వనుల వినుచుఁ
గొట్టుకొనుచుంటి బలియగుకురరి వోలె

దేనికై దుఃఖజీవి నైనానో నేను
అదియె నిష్కృతిగా గాయమయ్యె నెడఁద
మానునా యిది, కంట నీరైన రాదు
రాలిపడ దాపదాబ్జపరాగలవము

# పెంపుడు నెమలి

మేదురవినీలమేఘాల మేలిముసుగు
వేసికొనివచ్చె శ్రావణమాసలక్ష్మి
ధారుణి ధరించెఁ దొలకరి సారె యిడిన
యార్ద్రపురుగుపూవుల శాద్వలాంబరమ్ము

కడిమిపూల నెత్తావులకసటు వార
వృష్టిముందటి తడిగాలి వీవసాగె
ఏల యింతటి చక్కఁదనాల వేళ
నెగురులాడ రెక్కలు రావు హృదయమునకు

నేఁ డిదేమొ మా పెంపుడునెమలికొదమ
గోడమదురున మెడరాచుకొనునె గాని
యురము లురిమెడు మబ్బుల తెరువు కేసి
చూడఁబోవదు పురివిప్పి యాడఁబోదు

ఆడకున్ననుమానె గొంతైన విప్పి
కేకవేయ దాశల గిలిగింత లడర
కోడెత్రాచుల నరగించుకొనఁగఁ జాలు
ప్రకృతి కెటు గల్గెనో యెడబాటుబరువు

కన్ను తడియని మూకశోకమున ముంచి
నన్ను వెతనొంచె నీ పెంచుకొన్న ప్రేమ
వానకారునృత్యము చూడ వాంఛఁగొన్న
నాయెదఁ బ్రవాసవేదనాచ్ఛాయ లలమె

కుండపోఁతగ వర్షమ్ము గురిసె నేని
తేలిపోవును పో మింటి నీలిముసుగు
కాని, యెదలోని విరహదుఃఖంపుబరువు
తీరుటెట్లు నాకేని, మయూరి కేని

# కృతజ్ఞత

భస్మరాసులనుండి పావనత మేలు
కొలిపినట్టి భాగీరథీజలము వోలె
జన్మజన్మాల హృదయకశ్మలము నుండి
ప్రాణశక్తి రగుల్చె నీపై నిప్రేమ

నా నిరాలోకలోకమ్ములోన నిన్నె
యుపసిగఁ దలంచుకొన్న ముహూర్తమాదు
అనుభవమె గాని వెలిసేయ నలవిగాని
మధురవేదన ననునేనె మరచిపోదు

ఇంతనెత్తావి వాసించునేని యెడఁద
నెన్నిస్మృతు లెన్నికోర్కె లెన్నెన్నికలలు
జగదజస్రసహస్ర వసంతలక్ష్మి
యెదుర మూర్తిభవించె నాయెడఁదకొరకె

అలరునకుఁబోలె నాహృదయమ్మునకును
జన్మమున కొక్కటే వికాసమ్ము సకియ!
వలపు వెదఁజల్లి సుఖదుఃఖములకు వెలిగ
ధాత్రిగర్భానఁ గాంచు నాత్మప్రశాంతి

వలచి నిను విసిగించినందులకు ఫలము
అమరణ మేను ప్రేమగాయకుఁడ నగుదు
నీవు మాత్రము పూలవెన్నెలల రేలఁ
జైత్రనృత్యోత్సవమ్ముల సలుపుకొనుము

నాహృదయరక్తమే లలనావిలాస
లాక్షగా, నీ పదాల కలంకరింతు
నీ వసంతకల్యాణైకనృత్యమందు
నన్ను మనసార గాన మ్మొనర్పనిమ్ము

# ప్రతీకారము

నాహృదయతృప్తికై నీ వొనర్చినట్టి
కృత్రిమప్రేమగతుల లిఖించుకొనిన
యీవిషాదాంతకావ్యమ్ము నిపుడు చించి
కట్టెదను దీనిపుటలతో గాలిపటము

త్రెంచి దూముడివైచిన దీర్ణహృదయ
దుర్లభాశామృణాలతంతువునఁ గట్టి
యీ నవాషాఢమాససంధ్యానిలోర్మ్మ
లం దెగురవైచి దీనితో నాడుకొందు

అశ్రుపూరితమై, బరువైన హృదయ
పాత్రికను వంపలేక నావలెనెక్కివగచు
మబ్బుకన్నెలతో మానమలినగతులఁ
బరుగులిడు దీనిఁ గని తృప్తిపడుదు నేను

తంతు వీగతి సాగుచున్నంతవరకు
నీ వినీలాభ్రవీథి ని ప్లైగుర వైచి
నిలకడలులేని ఏషమంపు విలసనములఁ
గొట్టుకొనుదీనిఁ గని శాంతిఁ గొందు నేను

ఆశ తెగిపోయెనా, యీ యనంతసాగ
రార్ద్రిగర్భోజ్జ్వలద్బడబాగ్నితోడ
భస్మ మొనరింతు దీని నాభగ్నహృదయ
శకలములఁ జేర్చుకొనిన కాష్ఠమ్మునందె

# ని ర స న ము

విరిగి సమయుటే ఫల మని యెరిగికూడ
దరి నెనయఁ బాడుచును బోవు కెరటమట్లు
ఘోరమరణాంతక మ్మనుకొనియుఁ గూడ
వేగిపోవు నా బ్రదుకు నీ ప్రేమకొరకె

నన్నుఁ బ్రేమించువారి యానందమునకు
నేను విడువలే దొక్కయూ హైనగాని
నన్ను నిరసించు నీ చిరునవ్వుకొరకె
బ్రతుకు వెలిగించి వలపునివాళి యిడితి

రాత్రిబ్రదు కెంచుకొని యహోరాత్రములును
తెప్ప వాల్పని తిమిరయాత్రికుఁడ నేను
పంట బరువున వ్రాలిన పైరువోలె
కోఁతకై చూచుచుంటి నీకోర్కెదీర్ప

# ఉత్కంఠ

అనుపమప్రణయాతిథేయమ్ముతోడ
పారఁదెరచితి హృదయకవాట మిపుడె
మొయిలునీడలచీకట్లు ముసరుకొనిన
నీగృహము నీవె కైసేయ నేగుదెమ్మ

తేనెతావులబరు వోపలేని పూవు
ప్రొద్దుపొడుపునకై వేగిపోవు పగిది
బ్రదుకు బ్రదుకెల్ల తీయని వలపు నింపి
వేచియుంటి నీరాక కీవేళ స్వామి!

వలపు లొలికెడు పూవులు వాడిపోయె
కనకపీఠిక హారతి కునుకుచుండె
తమ్మిరేకులసురటి పొంకమ్ము దొరగె
నొంటి నిఁక నెంతసే పిటు లోర్తు స్వామి!

ఏమి దోషమ్ము దలఁచి న న్నీవియోగ
శోకమున ముంచి బాధింపఁ జూచె దీవు
చెప్పరా దోకో, యిటకు రా నొప్పవేని
వెదకికొనివత్తు నేనె నీపదముఁ జేర

కలసి త్రోద్రోపులాడెడు కారుమొయిలు
రాయిడి మునింగి భీకర మాయె రేయి
దివ్యతేజస్వి! నీ పరు దేర కునికి
ననదనై పడియుంటి శూన్యాలయమున

# ఈ నాఁటికి

కలఁత యెఱుఁగని లేఁతప్రాయపుఁ
దలిరుటెడఁదను తీగవారిన
చెలిమి జ్ఞప్తికివచ్చి కన్నులు
చెమ్మగిలిపోవున్

వల పెఱుంగని నాటి చేఁతలఁ
దలఁచుకొని నపు డెల్ల నేదో
మొలకనగ వీయెడఁదఁ బూవులు
పూచి నటు లౌను

దరిని బెరిగినమ్రాకు లచ్ఛపు
సరసిఁ జాయలు దేరు పోలిక
చిఱుఁతప్రాయపు వలపునీడలు
చిత్తమునఁ బ్రాకున్

కదలికదలని యేటినురుగును
బోదవు సందెనిగార మటు, లె
య్యేదియొ సుందరరూపపరిచయ
మెద గుబాళించున్

తెరగవిరిసిన మసకచీఁకటి
మరుగునం దరళించు వెలుఁగటు
మరుపులో నొక పూపప్రాయపు
మమత మినుకుమనున్

బ్రతుకుపై విసుగెత్తి నెమ్మది
చితుకుమంటగ నుండ, స్వప్నము
గతిని జ్ఞప్తికి వచ్చి యేదో
కరఁచు హృదయమ్మున్

మరలుసందెల, గాలితరగల
విరియుమబ్బుల నీలినీడలఁ
దిరుగు పులుఁగులజతలఁ గని మే
న్మరచి నిట్టూర్తున్

మింట మబ్బులు దొంతరిల్లుట
కంటఁ బడినపు డెల్ల బ్రదుకుఁ
బంట యేదో కోలుపోయిన
పగిది నెద వేగున్

చిట్టివలపులగూఁడు గట్టిన
చెట్టు వేరొక దారి కాఁగాఁ
బిట్టవలె నెద నేటి కడవులఁ
బట్టి తిరుగాడున్

# ఆవృత్తి

ఆ ప్రశాంతనిశాజఠరాంతమందు
కలతనిద్దురలో కలల్ గాంచుచున్న
గౌతమీనది నామనోగతవిషాద
తమము నంతయు తనలోన దాచుకొనియె

ఆ నదీసైకతముల నాయడుగుజాడ
చెరపివేయగ వెనువెంట నరుగుదెంచు
గాలితరగల చల్లనికడుపులోన
కన్నుమూసెను నాయూర్పుగాడ్పు లెల్ల

చెడ్డయో మంచియో మహాసృష్టియందు
జరుగు విషయమ్ములను తటస్థముగ నా య
నంతగగనమ్మునం దుండి యరయుచుండు
తారలె మదశ్రుకణముల నేరుకొనియె

నేనె మిగిలితి నీగౌతమీనదీప
విత్రగర్భమ్ములో మ్రోత వెట్టుచున్న
యుగయుగాంతర విశ్వమహోగ్రదుఃఖ
జీవగీతాల కావృత్తి చెప్పుకొనగ

# అశాంతి

కనికరము లేని దుఃఖవేదనల సెగల
పొగలఁ వెలిఁజిమ్ము వలపుటూర్పుల భరమ్ము
మోసికొని, నేనె నాలోన మూల్గుకొనుచు
గాలివోలె సమస్తావకాశములను
నెడతెఱపి లేక తిరుగాడి బడలినాను

దారుణపు జీవితంపు టెడారిలోన
తీరనిపిపాస నేదారి తెన్ను లేక
నేనె నాదుఃఖబాష్పశోణితలహరుల
నే విసుగు వేసటలు లేక త్రావినాను

కడుపుఁ గాల్చెడు మండుటాఁకటను రేఁగి
కోర్కె లొండొంటెని గ్రసించుకొనెడు కొలఁది
నోడ లెఱుంగక కాలమృత్యువును నేనె
కొంచెముగఁ గొంచెముగఁ గభళించినాను

కాని, ప్రౌఢైన నాయెదలోని బరువు
దీర, నాబ్రతు కూపిరి దేరుకొనఁగ,
కనికరపుఁ జూపుచిఱునవ్వుతునుక యైనఁ
గటికికఱ వయ్యెఁ బాడులోకాన నాకు

ఏ కడల మిన్కు మను చుక్కయేని లేని
యీా నభము క్రుంగి కూలిపోయెడు విధానఁ
గాఱుమబ్బులె కాదు, చీఁకటులె గాదు
క్రమ్ముకొననిమ్ము, కరడులు గట్టనిమ్ము

వలపుతీపి యెఱుంగని వట్టిరాతి
గుండెలోకమ్ము నిప్పులు గురియనిమ్ము,
హృదయమున్నంతవరకు నాప్రేమకాంక్ష
బ్రతికి యున్నంతవర కేడ్చి బ్రతుకుచుండు

ఏ వెలుఁగు నన్నుఁ దన దరి కీడ్చుకొనునొ
ఏ తలఁపు దారి సూపునో

# ఏ మ గు నో

ఏ మగునో యిక నా బ్రతుకు
ఎటు చూచిన దదియే కనరాదు "ఏ॥

ప్రేమరత్న మీ పేద కొదవునని
యీ మహాబ్ధి లో తెలుగక వెడలితి
ఏమగునో యిక నా బ్రతుకు

సాంద్రజలదముల ఝంఝానిలముల
సాగు చున్న దీ సాగరయానము
దారి చూపు నా తారయె మెరయదో
చేర లేనో సుఖజీవనతీరము
ఏమగునో యిక నా బ్రతుకు

# క లు వ

చీకటుల పాలైన యీకలువ బ్రతుకింక
సోకదా నీ సుధాశ్రీకరమ్ములచలువ ॥చీ॥
రేకురేకుల విరిసి నాకై బరువగు నెడద
వాక లగు తేనియల వలపు గాలికిఁ బోవ
చీకటులపాలైన యీ కలువ బ్రతుకింక

కోస మొదలు గనరాని మసకచీకటి రేయి
ముసరి మూగిన కారుమొయిలు కోసల దాటి
మెఱుగుకన్నులఁ గురియు చిఱునగవు వెన్నెలల
మరగు నాయెద జల్లబరుప రానే రావా!
చీకటుల పాలైన యీ కలువ బ్రతుకింక
సోకదా నీసుధాశ్రీకరమ్ముల చలువ

# ప్ర వా సి

నా మెడలోన వైచుకొనినా నొకదుశ్శకునంపువేళ మా
ప్రేమకు సూచకం బని నవీనమృణాళసరమ్ము, కాని యా
దామమనోజ్ఞతల్ హృదిని దాకియుఁదాకకమున్న తున్కలై
పో ముడి ద్రెంచి దుర్విధితమోమయవీథుల వైచెఁ గ్రూరతన్

నాటివిశాలనీలగగనమ్మును, నాటియనంతతారకా
కోటులు, నాటిలేమొయిలుగుంపులు, నాటినిశాంధకారముల్
నాటినిశీథమందపవనమ్ములు నావలె నేను కష్టపుం
జాటునఁ జిక్కి దుఃఖపడుభంగి విరక్తములై కనంబడున్

ఈ పడుచుందనంపుటెద యెచ్చటికో పరువెత్తు, నెంతగా
నాపుకొనం దలంచిన రహస్స్మృతు లేవో వియోగదుఃఖవీ
థీపతితమ్ములై, హతవిధిక్షుభితప్రథమానురాగరే
ఖాపరిభూతయౌవనసుఖస్పృహలన్ గదలించు మాటికిన్

పావనగౌతమీపులినభాగములం దిరుగాడుచుఁ బిపా
సాకులమౌచు నాహృదయమ్ము తపించి తపించి వెఱ్ఱియై
పోవు, నెవో రహోవిరహాభుగ్నదురంతవిషాదమర్మరా
రావము లీ స్రవంతికతరంగములం వినవచ్చుచున్నటుల్

ప్రేమకఠోరతల్ చిదిమి పెట్టిన దుర్దివసావసానవే
ళామసృణాంధకారపటలమ్ముల చాటున దాగి యెవ్వరో
కోమలతారకాద్యుతినిగూఢరవమ్ముల రమ్మటంచు నన్
వేమఱుఁ బిల్చుచున్నసరణిం మదిఁ దోఁచుఁ బ్రతిక్షణమ్మునన్

వెచ్చని నాయెడందఁ జెయివెట్టి కలంచిన యట్లు, సూదులం
గ్రుచ్చినయట్లు, కత్తిమొనఁగోసిన యట్టులు, చూర్ణచూర్ణమౌ
మచ్చున రాల పైఁబడినటు, మండెడునిప్పునఁ గాల్చినట్లు, క
మ్మెచ్చిన లాఁ.న ట్లనునిమేష మెవో స్మృతు లేచియేచెడున్

ఏయెడ నేమియే ననుభవించితినో యవియెల్ల నాత్మలోఁ
గోయని క్రోఁత లౌచు బ్రదుకున్ సుడిఁ ద్రిప్పి కలంప, వ్యర్థమై
పోయిన యాశలెల్లఁ దలపోయుచు సౌహృదజీవరాగముల్
మాయనిప్రేమచిహ్నల కమర్చెద బాష్పసుమార్చనావిధుల్

నాకుఁ బ్రశాంతిలేదు, కఠినమ్మగు శూన్యమునందుఁ గ్రుంగి చీ
కాకయి పోయె నా బ్రదుకు, కన్నులు విప్పిన మూసికొన్న బా
ధాకలుషమ్ము లాశ లెడదన్ విదళించును నిస్సహాయతా
వ్యాకుల శోకగీతులె యహర్నిశమున్ వినవచ్చు రోదసిన్

నేను నిశీథి నొంటి శయనించి గభీరతమోబ్ధిసంకులో
ర్మీనికరమ్ములం బులకరింపఁగ నా తుది లేని సైపఁగా
రాని ప్రవాసజీవనభరమ్ము స్మరించుచు రక్తబాష్పముల్
సోనలువార నేడ్చెద నులూకవిలోకనముల్ చెమర్పఁగన్

నా యెద కీ ప్రపంచ మనినన్ మృగతృష్ణలయింద్రజాలమై
పోయెఁ, గలంతనిద్రఁ గనుమూసితి నేని మనోహరాకృతి
చ్ఛాయ యెదో కనంబడుచు స్వప్నములం, బవలెల్ల దుఃఖముం
బాయనిమట్టినాహృదయమర్మములన్ మెలివైచి త్రుంపెడున్

నా కిపు డెల్ల వేళల వినంబడుచుండె నకాలమృత్యుగ
ర్జాకలితాట్టహాసముల సందడు లందునఁ బ్రేమవిహ్వలా
శాకరుణమ్ములా గుసగుసల్, మఱి చైత్రశుభప్రభాతవం
శీకలగాన మీశిశిరజీవనమం దిక లేనె లేదొకో!

# భగ్నవీణ

ఆ నభోమాసబహుళవర్షానిలములఁ
బులకరించిన నీ క్రూరవిలసనమ్ము
లీయెడఁద రాచిఱంపానఁ గోయ నెంత
పెరుగఁబడి నవ్వి న న్నేడిపించి తీవు

ఆ విమలగౌతమీస్రవంతీవివిక్త
పులినముల నా పొదల వెళ్ళఁబోసికొనఁగ
నీపదమ్ముల నాఁదల మోపి నవ్వు
డెంతగా నవ్వి నన్నలయించి తీవు

నా యవస్థ యెఱింగి యేనాఁడు నీవు
నవ్వితివో, మూలఁబడియె నానాఁడె ధూళి
గవిసి, తంత్రులు తెగి, మెట్లు గదలిపోయి
మోవఁగా రాని యౌవనాశావిపంచి

కార్తికజ్యోత్స్నలందు నేకాకి నగుచుఁ
ప్రాణసంత్రాణ మీ భగ్నవీణఁ దాల్చి
పాడుకొందు మౌనప్రేమబాష్పగీతి
నీ తనువికాస మాత్మ జీర్ణించువరకు

# దీపావళినాడు

నిశీథిని

జగతి యీనాటి యీ మహోత్సవమునందు
మునిగి యానందమునఁ బొంగిపోవుచుండ
ఇటు రగులుగొల్పి రెవరు నీహృదయమందు
నణఁచుకొనియున్న ఘోరదుఃఖానలమ్ము

నేను

కాలుకొన్న యమాసచీఁకటులనడుమ
నే నొకండనె యీ శూన్యనిలయమందు
అఱురువడిపోయి, మరణవాద్యమ్ము లట్లు
గుండియలు కొట్టుకొన నేడ్చుకొనుచు నుంటి

ఇంతగ దహించుకొనిపోవు నీయెడంద
బాష్పములు జారిపడి చల్లఁబడునో యనుచు
మూసికొనిపోయె నా నేత్రములు తమంత
రాత్రియే యింక బహిరంతరముల నాకు

లోన జ్వలియించుచున్న మహానలమున
నొక స్ఫులింగమె కాద యీ యుత్సవాగ్ని
శైశవ మ్మాది ప్రేమస్మశాన మైన
జీవి కొకనాఁటి కేళి దీపావళి యిఁక
విస్మృతోదంతములు శూన్యవీథులందు
నావలెనె మౌనముగ వెళ్ళిపోవుచున్న
యోనిశీథిని! నీ పిపీలోదరమున
దొరకె నీదురదృష్టవంతునకుఁ జోటు

చిమ్మట

బాణసంచుల ఫెళఫెళార్భటులు విరిసి
దశదిశాంతరములఁ బ్రతిధ్వనుల నీన
పేదవడియున్న మానజీవితపుటాశ
లిపుడు ప్రమోగించుకొను చుంటి వేల నీవు

నేను

నన్ను నిరసించు వారి యానందమందు
నాకు భాగమ్ము వల దొక్కనాఁటి కైన
చీఁకటులఁ జీల్చుకొని వచ్చు మిణుకురాళ
గానరవములనే నాసుఖమ్ము గలదు

దినములు పరస్పర ప్రతిధ్వనులు గాఁగ
నిరువదై దేండ్ల నా బ్రదు కిట్టె గడచె
ఈ రహోదుఃఖవీథులం దే నెఱుంగ
సఖులయడుగులజాడ కేసరికిఁగాడ

ఎడతెరిపిలేని కన్నీటిజడులఁ దడిసి
పంకిలమ్మైన జీవనప్రాంగణమున
శాంతిదేవతాచరణ లాక్షారసాఙ
కాంకలవలేశముల వెతుకాడుకొందు

గొంతువిప్పక లోలోనఁ గుమిలి కుమిలి
యెంత యేడ్చినఁ బగిలిపో దీయెడంద
ఆఁకొనినయాశ లెప్పటి కప్పు డవిగొ
కలయఁ ద్రిప్పును స్వప్నసాగరతటాల

మృత్యుగర్జాప్రవాహ గంభీరమైన
విధి నిదురవోవు ప్రేమజీవితములోన
సంఘటిలిన ప్రవాసదుస్స్వప్నవ్యథల
మడతలను సర్దుకొనుచుందు మాయకుండ

తెగిపడినపూలదండ లెత్తుగ నమర్చి
యంధకారము సందిట నదుముకొనుచు
నెవరికొరకో పదేపదే యెదురుసూచు
నాయెద కొనర్తు కృత్రిమానందభిక్ష

మ్రొక్కినకొలందిఁ గాలితోఁ ద్రొక్కివేయు
నీ కఠినలోక మెల్ల బహిష్కృతమ్ము
రండు, చిమ్మటలార! ఈ రాత్రివేళ
నావలెనె పాడుకొను మీరె నాకు సఖులు

# ఎప్పుడో!

కష్టభూయిష్ఠదుఃఖాంతకథలతోడ
విసివిపోతిని పుటలు ద్రిప్పిన కొలంది ;
కునుకుదీప మారదు ; పాడికనుల నిదుర
రాదు ; బరువైనయెద మనోరథము పోదు ;
పేదమృగముల నెత్తురు పీల్చి పీల్చి
బలిసిపోయిన శ్వాపదమ్ముల విధాన
వెఱఁగొలుపుఁ గాని, ఘట్టముల్ వేగ చనవు ;
మనుజపశువుల దౌర్జన్యమునకు లోఁగి
యినుపతలుపుల చెరఁబడ్డ యనపరాధి
కీర మట్టులు స్వేచ్ఛావిహారమునకు
ఱెక్కలార్చుఁ బ్రాణము సుఖస్పృహాలకలల ;
దేవతావిగ్రహము లేని తేరువోలె
నీరసనిరుత్సవనిరలంకారమైన
యీ వ్యథాక్లిష్టజీవితకావ్యమునకు
వంతిమాశ్వాసశాంతిసమాప్తి యెపుడో!

# గీతములు

గాఢదుఃఖాగ్నికీలలు గాల్చుకొలది
కదుప నొక వేడినిట్టూర్పుగాడ్పు నైన
ఎడతెగనియాపదల మున్కఁ లిడినకొలది
కనులరానీయ నొక బాష్పకణమునైన

ఆశలన్నియు భగ్నంబు లగు కొలంది
సలుప నొకరోదనపుసడిసన్న నైన
జీవనము స్వప్నశూన్యమై పోవుకొలది
జాడ లిడబోవ నొకమబ్బునీడకైన

ప్రేమదాహాన నెడద తపించుకొలది
అమృత మొలికింతు స్మితనయనాంచలముల
నన్నుఁగని యీప్రపంచమ్ము నవ్వుకొలది
తనియఁజేతు గొంతెత్తి గీతములు పాడి

# జ్వాల

ఊరు పూర్వునఁ దూగాడు నూర్ము లరసి
తరగతరగ వినం బడు తానము విని
నురుగునురుగున చుక్కలమెరుగు గాంచి
యాట యని, పాట యని, హాస మని తలంచ
గాని, యీ మహాసాగరాగాధహృదయ
బాడబానలజ్వాల యెవ్వరికిఁ దెలియు?

# ఆహ్వానము

నిత్యహింసారిరంసావినిద్రరుద్ర
భవనవాటికాద్వారకవాటములను
దెరచుకొని, యో యమృతశాంతి! దివ్యకాంతి!
నీ సుఖస్వప్నలోకశోభాసమీర
చాలితవిశాలపక్ష్మాంచలాలు సోకి
తూలిపడిపోవు బాధాతివేలహృదయ
వేదనాజాలములఁ ద్రోసివేసికొనుచు
అస్తగిరివాసినీ! జీవితావసాన
శైశిరతమోభిసారికా! స్వప్నరాజ్ఞి!
ప్రేయసీ! యొకమారు విచ్చేయు మిటకు

లోకలోకాలశాంతివెల్లువలువారు
నెఱ్ఱజీరలవాల్గను లెత్తి నవ్వి
చారుహేమంతసంధ్యాతుషారసార

శీతలకృపామృతాసారసేచనములఁ
దప్తహృదయమ్మునకుఁ జల్లదన మొసంగ
ప్రేయసీ! ప్రేయసీ! దయచేయు మిపుడు

సకలలోకాధినాథపూజాసనాథ
కనకపీఠికోజ్జ్వలదలంకారమైన
నీ జిలుగుపైటచెఱఁగు లేనీడలందె
జీవలోకనిరంతరాశావికాస
వాసనోచ్ఛ్వాసములఁ బ్రోవుచేసికొనెడు
కోమలాశ్రుమౌక్తికమాలికామనోజ్ఞ
మైన నీ హృదయాన నన్నదుముకొనఁగ
ధిక్కృతప్రేమచరమాతిథి! మహాబ్ధి
పారదూరప్రవాసినీ! ప్రాణశాంతి
గాయనీ! ప్రేయసీ! దయసేయుమిటకు

మరణదేవతవో, సుధామధురవిధుర
జీవశాంతివో, ప్రేమైకజీవకళవో
విలయసౌందర్యధాత్రివో, విశ్వగాన
మోహినివో, యిహదుఃఖతమోనియతివో

ఎవతె వైన సరే; క్షణమేనిగాని
కష్టనిష్ఠురశోకలోకమ్మునందు
వలపు తొలఁగిన యీ పాడుబ్రదుకుబరువు
నీడ్వలే కేడ్వలే కిట్టు లేడ్చు నన్ను
త్వద్భుజాశ్లేషమృదులబంధమునఁ జేర్చి
కాలజలధితరంగాల జోలఁ బాడి
మాతృవక్షమ్ముపోలె ప్రేమప్రసన్న
మైన యద్వంద్వకాంతి సీమాంతరమున
శాశ్వతసుషుప్తి నుంచి ప్రశాంతుఁ జేయ
ప్రేయసీ! ప్రేయసీ! దయసేయు మిపుడె

## ఘూర్ణిమ

ఆ యుదయాద్రి నుండి యరుణారుణ మహాముఖ మెత్తి గాఢల
జ్జాయుత రహా నవోఢవలె సందడి సేయక తొంగితొంగి లో
లాయతదృక్కులన్ దశదిశాంతరముల్ పరికించి జీర్ణమై
పోయిననాకుటీరపథమున్ గుఱుతింతువు చాటుచాటుగన్

ఈ వలిగాడ్పు లెంత వడకింపుచునున్నను, నీప్రవాళరే
ఖావిలసన్ముఖమ్ము దసిఁగట్టెడుసిగ్గున సంచలించినన్
మోవగరానిప్రేమను విముక్తగవాక్షపథమ్మునుండి నా
క్రేవకు వత్తు వెట్లొ పులకింపఁగ నాతృణకీర్ణశయ్యయున్

పొంగులు దేఱుతీయవలపుల్ హృదయమ్మును ముట్టడింపఁగా
వంగి సుషుప్తిచే ముడుపువారిన నాకనుబొమ్మలన్ సుధా
లింగితచుంబనమ్ములఁ జలింపఁగఁ జేసి సుఖోదయవ్యథా
భంగములం గలంతువు భవన్మృదులోచ్ఛ్వసితానిలాహతిన్

ఆ నునుమబ్బుకౌఁగిళుల కందని నీ లవలీమనోజ్ఞమా
మేనిసుధామృతు ల్నిదుర మేల్కొలుప న్నవమాఘమాససం
ధ్యానిల మట్లు నాతనులతం బులకింపులతో స్పృశింప, బా
ధానిశితంబు నాపువుటెదం గదియింతువు నీయెడందపై

ఈతృణశయ్యయందె నిదురించెద మిద్వరముం బరస్పరా
ద్వైతగతాత్మవృత్తిని భవద్భుజవల్లుల నన్ను బంధితుం
జేతువు నీవు, నే నపుడు నీయమృతాసవ మెల్లఁ ద్రావుచున్
రాతిరి నొక్కస్వప్నమధురక్షణ మట్టుల వెళ్ళఁబుచ్చుదున్

# స ము ద్ర త టా న

ఓవిరహావేషానుభావమధురాకృతీ
యౌవనోన్మిషితలజ్జావకుంఠనవతీ
జాలిదోలుకాడు, నీ
వాలు తెలిచూపులను
నాలో వియోగక
ల్లోలమ్ము రేపుచును
ఈసముద్రతటాన ఏసఖునికోసమై
గాసి జెందుచునుంటి వోసఖీ! ప్రియసఖీ!

తూర్పువాకిటిగూట తొలిదివ్వె వెలిగించి
తొగరుపావడసంజ తొలగిపోయెడువేళ
ఒంటిగా వేడిని
ట్టూర్పు లెగబోయుచును
జంటదొరగిన పడుచు
చక్రవాకివిధాన
ఈసముద్రతటాన ఏసఖునికోసమై
గాసి జెందుచునుంటి వోసఖీ! ప్రియసఖీ!

అలలపై నెఱసంజయపరంజిమెఱుగులకు
నీ చరణపల్లవోన్నిద్రలాక్షారక్తి
అనురాగ శృంగార
మై వింత సుడు లీన
అలవరుణశుద్ధాంత
మవని కేతెంచినటులు
ఈసముద్రతటాన ఏసఖునికోసమై
గాసి జెందుచునుంటి వోసఖీ! ప్రియసఖీ!

పసిడిసరిగంచుమేల్ముసుగుతో నీటిదరి
యిసుకపై నడచు చెడనెడ నడుగు తడబడగ
ఏనాటి యనుభవమొ
ఏకఠినహృదయమో
యెంచి, యున్నతవతు
మొగము నెగయూర్చుచును
ఈసముద్రతటాన ఏసఖునికోసమై
గాసి జెందుచునుంటి వోసఖీ! ప్రియసఖీ!

పాలిపోయిన నీ కపోలాలపై వ్రాలి
నీలాలకలు రహస్యా లేవో చెవి నూద
రాలిపోయిన పూల
తేలిపోయిన కలల
కోలాహల మ్మెడద
మూలమూలల మ్రోగ
ఈసముద్రతటాన నేసఖునికోసమై
గాసి జెందుచునుంటి వోసఖీ! ప్రియసఖీ!

నీయెడద నుప్పొంగు నిర్మలప్రేమవా
ర్నిధి కీ సముద్ర మొకనీటిబొట్టె యౌనో
వినరాని ఘోషతో
విరిగిపడు తరగ లే
విరహగీతము లాల
పించి వేధించునో
ఈసముద్రతటాన ఏసఖునికోసమై
గాసి జెందుచునుంటి వోసఖీ! ప్రియసఖీ!

# ప్రభాతగీతి

విరహబాష్పతుషారమ్ముఁ గురిసి కురిసి
కను మొగిడ్చెను హేమంతకాలరాత్రి
జీవచైత్రప్రభాతవంశీరవమ్ము
మ్రోగుచుండె రోదసి మూలమూలలందు
సప్తరథ్యప్రయాణహేషారవమ్ము
సాగెఁ దూరపు పైడిమోసాల మ్రోల
నరు లుపేక్షించు తృణదళాంతరహిమాశ్రు
కణముపై లోకబాంధవు కరము సోకె
ఓ విషాదప్రపంచయాత్రావిరాగి!
ఓ నిరాశాపథైకపురాణపాంథ!
ఓ ప్రవాసదుఃఖాశ్రుపయోదమూర్తి!

రేయి కాటుకకనుల జారినవిషాద
బాష్పవారి నొకేసారి పారఁబోసి
యీ మధుప్రాతరాహ్వాన సామగాన
మంచువెలము జీవనపాత్ర నించుకొమ్ము ;
పూవుపూవునఁ దాఁవి గుబుల్కొనంగఁ
బాలవన మెల్ల నిలువునఁ బులకరించె
కోవమ తెమ్మెరపిల్ల నగ్రోపితోడఁ
బులుగుఁగొంతుక పాటరెక్కల విదల్చె
అణువణువుగూడ శుభగీతు లాలపించు
వందనోత్సవమందిరాళిందసీమ
నీరవగళమ్ముతో నీవు నిలువరాదు
భూతకాల దినాంతానుభూతితోడ
భావియుగముల కల్యాణపథముఁబట్టి
వెలుఁగునీడల జీవనవేణువూది
పాడుకొనుమ యీనాఁటిప్రభాతగీతి

# ఆషాఢమేఘము

ఏ విరహార్తుడేని హృదయేశ్వరి సన్నిధి కేగజాలు వా
ర్తావహు గోరి, యేగిరినితంబతటమ్మున నేని చిక్కి, వా
పోవుచునుండెనేమొ యని, పొంచి దెసల్ పరికించి చూచుచు
న్నావె ప్రవాసదుఃఖితమనఃప్రవణోత్సవమా, పయోదమా!

ఈ యచలేంద్రు డౌదల ధరించిన మేలిహారంగునీలిపా
గాయటు, వేగుబోక చిరుగాలికి నట్టెటుఊగు ని న్గనన్
నాయెద కాళిదాసకవినాటి యొకానొక యక్షువేదనా
ఖ్యాయిక జ్ఞప్తివారి కరుణార్ద్రమగున్ స్వగతానుభూతిగన్

లే దలనాటి యుజ్జయిని, లే దలకానగరీప్రయాణస
మ్మోదము, లేడు ప్రేమభరముగ్ధుడు నాటిగిరిప్రవాసి, భా
నూదయచిత్రితేంద్రధనురుజ్జ్వలమూర్తివి నీవె నాటి మ
ర్యాద ప్రవాసిబాంధవుడవై కనుపించెదవోయి నేటికిన్

తరుణీదూరులు, ప్రేమజీవనదరిద్రాణుల్. నభోమాసకా
తరులౌ దీనుల దుఃఖబాష్పకణముక్తాపాళి వార్తాకుఁడో
త్కరముంబోలె వహించి, యంబరపథాంతర్నిత్యయాత్రాధురం
ధరతన్ మానవు నేటికిన్ ప్రణయదౌత్యంబీవు మేఘోత్తమా!

తొలకరి పాటపాట జడితుంపరలన్ పయిపై గ్రసింపగా
దలచి, బలాకలున్ కలరుతమ్ముల నావలెనీకు స్వాగతో
క్తులు పచరించుచున్న వవిగో! తడిదుక్కిపొలాల తావులం
గలసిన పైరగాలితరగల్ చలచల్లగ సేదదేర్పగన్

కాటుకలేని సోగతెలిగన్నుల ముత్తెము లట్లు జారు క
న్నీటికణాలజాలు కుచనిర్గుణహారత బూనగా, ఎడం
బాటువగన్ నినుం గనెడు భామల పాటం లేని వాపటన్
నీటుగతీర్చి దద్దెదవు నీతొలినీటిమెఱుంగుముత్తెముల్

నీ యతసీప్రసూనరమణీయనవాకృతి పండువట్లు క
న్దోయికి కానరా, అగరుధూపసుగంధిలమా ప్రియావినీ
లాయతకేశపాశము హృదంకితమై వలపుంగలల్ కనం
బోయెదువారె యిప్పటిఘనుల్ నవనాగరకత్వకింకరుల్

మాసినవాసనామధురిమమ్ముల భౌతికశుష్కజీవన
గ్రాసపుమేరలన్ గడచిరాని తలంపుల బోవు ప్రేమస
న్యాసుల నీరసంపుహృదయంబుల కేమిటి కిప్పు డీ నభో
మాసనికేకలున్, విరహమాధురులున్, దయితాప్రవృత్తులున్

# శ ర దు త్స వ ము

నాహృదయ మిప్పు డరమూఁతనగవులఁ డె
కనెను శాంతిదేవత కడగంటిచూపు
బ్రతికినన్నాళ్ళ కీ ముహూర్తమున విరిసెఁ
దొలివలపు దొల్కు జీవమాధుర్యరుచులు

మిగులఁ గంపించు నాపేదమేని నిపుడు
సుమమృదులహస్త మేదియో నిమురుచుండె
కన్నతల్లి దీవనతోడి కౌఁగిలింత
జారు తీయనికన్నీటిచలువ లొలయ

విరిసెఁ గాఁబోలు! జగదధీశ్వరుశిఖావ
తంసకుసుమమ్ము, దిగ్దిగంతమ్ములందు
సౌరభోచ్ఛ్వాసముల వెదఁజల్లుచున్న
దానుకూల్యమ్ముతో శారదానిలమ్ము

ఇంత లేమబ్బుచిఱుతునుకయేని లేమ
విప్పి రేమొ నిశారాజ్ఞి వెల్లగొడుగు;
ఏమి శ్రవణోత్సవ మ్మిప్పు డీవిశాల
గగనమున కోటివిజయశంఖములు మ్రోగు

చంద్రికావసనాంచలోచ్చాలనములఁ
జిరవిరహావాసనల నెగఁజిమ్ముకొనుచుఁ
దాండవించెను నమృతసౌందర్యలక్ష్మి;
యుర్వి కీనాఁడె తొలిశరదుత్సవమ్ము

నరకలోకపుఁ జీఁకటి తెరలవంటి
వెన్ని నిశ లేగ నొకస్వప్నమేని లేక
ఇంతసౌందర్య మింతప్రశాంతిసౌఖ్య
మింతమాధుర్య మెటు దాఁగె నింతవరకు?

ఎంతస్వేచ్ఛయొ! నేఁ డీయనంతసృష్టి
గాన మొనరించుఁ బ్రతిజీవకణముగూడ
శైలగర్భాంతరాళ నిర్ఝరమువోలె
నెదియొ కళపెళలాడుఁ బై కెగయ నెడఁద

బాష్పకుంఠితకంఠానఁ బాడలేక
నాయెడఁద నింపుకొందు సౌందర్యరసము
నిలుపుకోలేను. నాలోన నేను విరిసి
రాలిపోదు వృంతచ్యుతప్రసవ మట్లు

ఓసఖీ! ఓసుహాసిని! ఓశరద్వి
భావరీనర్తకీ! కవిభావనావి
లాసినీ నిత్యసైరంధ్రి! ఓసమస్త
లోకమోహిని! ఓస్వప్నలోకరాజ్ఞి!

ఈయమృతశాంతియే చాలు నెపుడు నీ క
టాక్షభిక్షున కాజీవితాంత మింక
శ్రీచరణలాక్షతోడ నాహృదయకుసుమ
దళము లనురాగరసరంజిత మ్మొనర్తు

## సుధాకరా!

ఓయిసుధాకరా! నిలువు మొక్కనిమేషము; నీ మహోదయ
చ్ఛాయలు సోకి నాయెడఁద సాగర మట్టులు పొంగుచున్న దే
వో యనుభూతజీవితసుఖోర్ము లపూర్వవిముగ్ధనాట్యముం
జేయుచుఁ బాడుచున్నవి పనిర్మలమోహనరాగగీతికల్

నాకిపు డీ ప్రపంచ మొకనందన మట్టులు నీయనంతలో
కైకపవిత్రకాంతిసుధలందున పిచ్చిన మూగపోయగం
బై కనుపట్టె; మానవులయాశలతో పిధికిన్ నిరంతరా
నీకము సాగునీకటికి నేల మనోజ్ఞత యింత నిల్చునే?

ఈయది మోదమో, యెడఁద నేర్చెడు ఖేదమొ, యంతలంతలై
పోయెడు మోహమో, తొలగిపోవని స్వప్నమొ, చెప్పలేని దే
దో యనుభూతి దివ్యపవనోర్మిపరీమళ మట్లు ముగ్ధునిం
జేయుచునుండె నన్నిపుడు నీ తెలికాంతులకౌగిలింతలన్

నీ వొకయప్సరఃప్రణయినీకబరీచ్యుతపారిజాతమా
లావిసరంబవో, మఱి యిలాతల మంట సుధాతుషారవ
ర్షావిమలావకుంఠనము జార్చుచుఁ జోవు శరద్విభావరీ
దేవిలలాటికామణివొ దీపికవో సురరాజ్యలక్ష్మికిన్

అలసటఁ జెందె దేమొ, యుదయాస్తమయమ్ములె జీవనమ్ముగా
దలచెడుమర్త్యపాళి కమృతప్రభలన్ వెదఁజల్లి ; యింత సొం
పు లొలుకు వెన్నెలం గనులుమూయని పేదలకై కృపారసం
బొలికెడు నీసుధామురళి నూదుదువో భువనాలు సోలగన్

చిరవిరహైకవాసనలఁ జిమ్ము సుఖస్మృతు లేవొ పైపయిం
బొరలుచు, దుఃఖపుంగసటు వోవనియాశల మేలుకొల్పు, సుం
దరతరచంద్రికాపులకిత మ్మగునింతటి తీయనైనరా
తిరి తెలవారి పోవక యిదే గతి నాకయి నిల్వరాదొకో!

ఓయమృతాశ్రుమూర్తి! యెటకో పరువెత్తెదు వాయులీనమై
పోయెడురాగరేఖవలె, మోయగరానిప్రవాసదుఃఖమో.
తీయనిప్రేమవేదనయొ, తీరనికోరికయో, యెదో యెదం
గోయునొయేమొ రాల్చెద వనూనహిమాశ్రుకణాల నావలెన్

విరిసినపూలవెన్నెలలవెల్లువఁ జక్కఁదనాలహంసవై
యరిగెడునిన్నుఁ జూచునిశలందున నాకగుబాష్పశాంతి నీ
వెఱుఁగుదు ; దుఃఖతాపముల కిల్లగుపాడుప్రపంచమం దెఱుం
గరు కరుణైకముగ్ధుల యగాధహృదంతరబాష్పమాధురిన్

ప్రేమపిపాసచే నమృతవీథులఁ జేరిన యప్సరోంగనా
స్తోమసితావగుంఠనతతుల్ సుమి యీ తెలిమబ్బుదొంతరల్
నీమృదుశయ్యలై సుధలు నింపిన నీస్మితరోచిరూర్మికా
కోమలఫేనరాసులయి కూర్చెడు నాయెద కింతవేదనన్

నేను నిరంతరప్రళయనిష్ఠుర మీబ్రదుకున్ భరింపఁగా
లేను,క్షుధాగ్ని నార్పుకొనలేక తపించెడు ప్రేమకాంక్ష యిం
తేని నశింప కుంట మరణింపఁగలే నిటు లే నిరోధముల్
లేని మహాప్రవాహము చలింపక నిల్చిన దొక్కనాయెడన్

ఆమృదుచంద్రికాయవనికావృతనీలనభోనిశాంతశో
భామయసీమలం దమృతవాటుల స్వప్నపథాల నొక్కయీ
యామినిమాత్రమే తిరుగులాడెద నేఁ జిఱుమబ్బువోలె, నీ
తో మనసార, నొక్కపరిఁదోడ్కొనిపొ మ్మటకో సుధాకరా!

# మురళి

నీగీతి విశ్వ మంతా గొంతువిడి పాడు
నీతోడ ప్రాణలీలా తాండవ మ్మాడు
ఓ దివ్యగాయకా
ఓ ప్రాణనాయకా
ఏది యింకొక్కమా రూదరా నీమురళి

నాలోన నేడు బృందావనము విరిసినది
నాలోన నేడె యమునాతటిని మొరసినది
ఏ వసంతానిల మొ
ఏ గానకలకల మొ
ఈనాయెడదనిండా నిండిపోయినది
ఓ దివ్యగాయకా
ఓ ప్రాణనాయకా
ఏది యింకొక్కమా రూదరా నీమురళి

ఆనందలేశమైనా నోచుకోలేదు
రా, నాప్రవాసపాషాణజీవనము
భాగ్యసుమవాసనలో
పుణ్యఫలమాధురులో
నీపాటతీపి నేడే పొంగుచున్నవిర
ఓ దివ్యగాయకా
ఓ ప్రాణనాయకా
ఏది యింకొక్కమా రూదరా నీమురళి

# సంధ్యాన్వేషణము

అంతరించెను బశ్చిమ ప్రాంగణమునఁ
గుంకుమరంగవల్లి నికుంజశోభ
చిందువారెను దినశ్రీ కాలకుంతల
చ్ఛాయలో విరహవిషాదరేఖ
శాంతించె ద్విజరాజసాంధ్యమాగధుల
కైవారమ్ములను గడనాఁగెగీతి
తడవాయెఁ దలఁగి వాత్సకధేనుకాన్యోన్య
సమ్మేళనాహ్వాన సంభ్రమమ్ము
కలిగెఁ బ్రేయసీసల్లాపకాంక్ష యెడఁద
దోహనోత్సుకగోపసందోహమునకు
శ్యామికాగోకులమున నీజాడ లేదు
స్రుక్కి యెట నుంటివోయి, కిశోరమూర్తి!

త్రోపుడులాడు కార్మొయిలుదొంతర గ్రమ్మి తమాలపాదప
వ్యాపృతమైన గోకులవనాంతరమంతయు శ్యామికాంజన
స్నాపిత మయ్యె. నీయడుగుజాడలు గానఁగ రావునాకు, గో
గోపకులన్ డిగన్ విడిచి గోపకిశోరక యెందుఁ బోతివో!

తీయనివాయుపూరణగతి న్నునుబుగ్గలు బూరటిల్ల, హ
ర్షాయితమై ప్రపంచము కరంగఁగ, మోహనవేణుగానముం
జేయుచు మాళిపింఛరసనృత్యముఁ జూపమి నీపవాటికా
చ్ఛాయలు విన్నబాటు గొనసాగె నెటేఁగితో దివ్యగాయకా!

నీలిమొయిళ్ళనీడల వినీలములైన కళిందజాసరి
త్కూలతరంగమాలికలుగూడ, భవన్మురళీమనోజ్ఞ గీ
తాలలితానురాగరసతత్పరతన్ సడి మాని మంత్రిత
వ్యాళము లట్టు లున్నయవి వైణవికాగ్రణి! యెందుఁబోతివో

పొదుగుల జేపుపాలు గొనఁబోవక, పచ్చిక ముట్టరాక, యె
ల్ల దెసల శూన్యవీక్షణముల న్నిగుడించుచు నేవిషాదమో
యొదవినయట్లు జిచ్చవడియున్నవి మోములు వంచి లేఁతయాఁ
గదుపులు క్రోవినూదుపసికాపరి నీ వెట నుంటివోగదా!

తావులఁ జిమ్ము మంజులలతాంతచయమ్ములనుండి జిమ్మునం
గ్రేవల జారు తేనియలరీతిని దీయఁగ హాయిగాఁ జవుల్
జీవకళల్ దొరంగు మురళీమృదుగానరవమ్ము లేమి బృం
దావని శూన్యమయ్యె యదునందన! ఏ వెట కేఁగినాఁడవో

కెందలిరాకుజొంపములఁ గృష్ణవియోగవిషాదఘూమముల్
చిందులువారె, ఖిన్నలవలీలతలన్ చ్యుతసూనగంధముల్
కొందలపెట్టె, పూఁబొదలలోఁ బతితశ్లథపత్రమర్మరా
క్రందము సందడించెఁ గనరా వెట నుంటివి నీవు మాధవా!

బాలరసాలపాళి దిగఁబారిన యీగురివెందతీవ యు
య్యాలల నూఁచు బాలమలయానిలుతోఁ శ్రుతిఁగల్పి కోయిలల్
జాలిగఁ గూయుచున్నవి ప్రశాంతవసంతదినాంతవేళ గో
పాల! తమోవిలీనవనపాంథుఁడవై యెట కేఁగి యుంటివో!

శ్యామలవల్లికావృతనికుంజతలమ్ములయందు, శాద్వల
శ్యామలభూములందు, సువిశాలతమాలమహీజవాటికా
రామములందు, శీతలతరంగనిషిక్తనదీతటోపల
స్తోమములందు నీయునికి దోఁప దెటేఁగితొ శ్యామసుందరా!

కొఱకుదర్భల రాల్చుచుఁ గొందమ లేళ్లు
కడిమిబోదెల కొరగి బెగ్గడిలినట్లు
దెసలఁబరికించు బాష్పార్ద్రదృష్టి నిపుడు
సాంధ్యవేణుగీత మ్మోల సాగ దనుచు

తీవనో పూవనో వసుమతీజమనో, యమునాపగోర్మినో
గోవునో మబ్బునో, వెదురుక్రోవినో, చుక్కనో యై జనించినం
దావకవేణుగానము సదా వినుచుందుఁగదా యటంచు చిం
తావివశాత్మ యా చరణదాసికిఁ గన్పడ వేమిపాపమో!

# రాధ

పవనపులకితచంద్రాతపప్రసన్న
చారుశారదయామినీసమయమందు
వీథివీథుల మథురలో వెదకి వెదకి
చేరుకొంటిని బృందావిహారు నిన్ను

దూరముననుండి నీమురళీరవమ్ము
హృదయమున సోకినంత మే నెల్ల మరచి
తిరుగుచుంటిని యమునానదీపవిత్ర
పులినసీమల వెఱ్ఱినై పోయి నేను

రవికరోద్దీప్తహిమశీకరమ్ము వోలె
రమ్యపింఛము చిత్రవర్ణములఁ దొలుక
శిరము నూపుచు మోవిపై మురళి నూని
యేది మరియొకమారు వాయింపు మోయి!

మంజులసుమామృతములోని మధురిమమ్ము
మధురచంద్రాతపములోని మార్దవమ్ము
మృదుసమీరమ్ములోని పరిమళమ్ము
కలవు గోపాల! నీ వేణుగానమందు

ప్రకృతి పులకింప, యమునాస్రవంతి పొంగ
భావము చిగుర్పఁ, బిల్లనగ్రోవి నూది
పరవశం జేసి నన్ను, గోపాలకృష్ణ!
ప్రేమ తనివార నొకముద్దుఁ బెట్టుకొనుము

## ఆశాగానము

ఏసడి లేక యీప్రకృతి యెల్ల నిశీథతమోనిబద్ధమై
నీ సుకుమారహస్తముల నిద్దురవోయెడువాన వేళ, నీ
వే సరిజేసి యీశిథిలవీణను బాడు మటంచు నాపయిన్
ద్రోసెద వేల? తీగ తెగునో, శ్రుతి దప్పునొ, పల్కదో ప్రభూ!

మావులగుంపులందు మధుమాసములన్ వికసించు కోకిలా
రావమువోలె రాగమధురమ్ముగ వీణ నదింపఁజాల, నన్
బోవఁగ నిమ్ము; ప్రేమరసపూరితవిశ్వవిలీనగాన మీ
వే వినిపింతువేని సుఖియించెద నే నది యాలకించుచున్

ఏవిధినైనఁ బాడు మనియే వచియింతువయేని ప్రేమమై
నీవె రచించి నాకుఁ గరుణించిన నీ ప్రణయార్ద్రగీతికల్
గావున, నావిశుష్కతగళమ్మున నీకరుణాసుధారస
శ్రీవిభవమ్ము నింపి మధురింపుము నే శ్రుతిగల్పి పాడెదన్

# క న్నీ టి పా ట లు

౧

కారుచీఁకటిలోనఁ గన్నులు మూసి
యొడలెఱుంగని నిద్ర నుండినవేళ
జిఱునవ్వు చిలుకుచుఁ జెంతకు వచ్చి
యనుకూలపవమాన మట్లు మైసోకి
జన్మజన్మాలవాసన లూర్చి యూర్చి
నాహృదయమ్మును నను మేలుకొల్పి
మంజులస్వరముతో మధురరాగమున
నేనాఁడు వినియైన నెఱుఁగనియట్టి
పాటలుపాడి నన్ బరవశంజేసి
తొలిచూపులో రూపు దోఁచినయంత
తొలియూర్పులో వేడి పొలసినయంత
తీయనికల యట్లదృశ్యమై పోయె

౨

కనులెత్తి కనినంతఁ గరఁగిపోయితిని
మాటలాడినయంత మమతనుగొంటి
పాటఁ బాడినయంతఁ బరవశనైతి
దరిఁజేరినంతనే దాసినైపోతి
కన్నులఁ జిరునవ్వు వెన్నెలగురియ
వలపుపిల్లనగ్రోవి వాయించునతని
పాదాల సుమమాలపగిది వ్రాలితిని
ముడితేనెకన్నీట నడుగులు గడిగి
తీయనివలపు లుపాయన మిచ్చి
‘ఉంటి నీకై’ యని యంటినో లేదొ
సురచాపమట్లు మంజులగానమట్లు
అంతలో మటుమాయమైపోయినాఁడె!

౩

అడ వెల్లఁ దిరుగాడి యాయాసమనక
సగమువిచ్చిన సన్నజాజిపూవులను
తీవ కొంకొక్కకపూవు తీరునఁ గోసి
తనకంఠమున వేయుతలఁపున నేను
కట్టిన యీదండ కతినుఁడై త్రెంచి
నామెడ కురివోసి నను మాయ జేసి
యెటుపోయినాఁడె నాహృదయేశ్వరుండు!

౪

తేటిరెక్కలనీడ, తెమ్మెరయూర్పు
పసిప్రొద్దునుముద్దు, నిసికంటినీరు
సోకక తాకక సోనలై పారు
కమ్మ తేనెలతోడ గమగమవలచు
నీపేదపూవుపై నిసుమంతయేని
కృపలేక యడవిని గిరవాటువైచి
యీకారుకోనలో నీకొండపొంత
నీముండ్లపొదలలో నీరాళ్లదారి
కనురెప్పపాటులోఁ గనఁబడకుండ
నెటుపోయినాఁడె నాహృదయనాథుండు!

అలరులుముడిచిన యామని రేల
తలవిప్పుకొనియాడు తొలకరి రేల
వెలిరెక్కలల్లార్చు వెన్నెల రేల
జడివారుకన్నీటి చలికారు రేల
తలిరుఁబ్రాయమునాటి తలఁపులలోన
మరులుగొల్పెడి వానిమధురరూపమ్ము
ప్రాయంపుఁదీయనిపాటలలోన
రాగమొల్కిన వానిరమణీయగుణము
తలపోసికొనుచు వంతలమోసికొనుచు
సొదరూపుగొన్న యీశుష్కజీవితము
నెట్టులో నిలిపితి నిన్నాళ్ళదాఁక
నిముసమైన గృహాన నిలువలేనింక
సైపలేనింక దుస్సహవియోగమ్ము
సాగింతు నాప్రేమసాగరయాత్ర
తేలుటో మునుగుటో తేలెడుదాఁక

దూరదూరమునుండి తోయధిపిలుపు
చెవిసోకి పరువెత్తు సెలయేరువోలె,
వినువీథిఁ దోలిమబ్బుకనుసైగ దోచి
దరిఁ జేరఁబోవు బెగ్గురుకన్నెవోలె,
నేకడనుండియో హృదయేశు మురళి
యెదసోకి నిలువోక యేగుదెంచితిని
పోయెద నాశాంతములకైన గాని
చేరెద నంభోధిపారమ్మునైనఁ
పూలవెన్నెలకడలి పొంగినవేళఁ
బూచినవిరజాజిపొదలక్రీనీడ
నిసి నీలితలకట్టుకొనస లార్చువేళ
సెలయేళ్ళదరిఁ జెట్లచేమలనడుమ
బ్రదుకెల్లకన్నుగా వెనుకాడుకొందు ;
మోమోడుసిగ్గును మూలకుఁద్రోసి
మొరపెట్టుకొందు నావిరహజీవితము

ఎలప్రాయపుటెడంద మొలిచినతీవ
తనుమగాఁదరమౌనె దుర్విధికైన
ఏజామునందైన నెచ్చోటనైన
నెట్టిచిక్కులనైన నేరీతినైన
చాయనై నీవెన్క నే యుందునన్న
మాట యంతంతనె మరచితివెట్లు?
అవ్వాలిమోమైన యంత నేమాయె
లోగుట్టు నిట్టూర్పులో వెలిగాదె,
కన్నెత్తి చూడలేకున్న నేమాయెఁ
బులకరించినమేను తెలుపదే మనసు,
మాటాడకున్నంతమాత్ర నేమాయె
చెప్పదే మర్మంబు చెక్కిలిచెమరు,
ఎన్నిజన్మాలదో, యీమనప్రేమ
నేడు దాచిన దాగునే మనలోన
అపరాధ మెరుగనియనదను నేను
ప్రాణేశ మనకేటి పంతమ్ములోయి!

౮

నీకింతమనసు లేనే లేదయేని
రాగానల మ్మింత రగులింపనేల
ఆశగొల్పెడితలం పసలె లేదేని
నాదరి నీవేణు వూదుట యేల
సాధించుబుద్ధియే జనియింపదేని
ఆగుపించి మటుమాయమైపోవనేల
ఏనెఱుంగుదును నీహృదయమర్మంబు
జాగేల భయమేల సంశయమేల
నాప్రాణపతివీవె నానిధివీవె
నాజీవనమవీవె నాయాశవీవె
నాపవిత్రాత్మైకనాధుడవీవె
మాయని కనుచందమామవు నీవె
పారమ్ములేని గభీరమహాబ్ధి
దరిఁజేర్చుకొను కర్ణధారివి నీవె
నీవు లేకున్న నీనిఖిలలోకమ్ము
నాపాలిచీకటి నరకమ్ముగాదె

౯

మర్మంబు తెలియని మనసులో కోర్కె
యారిపోవనిజ్వాలలయి కాల్చుచుండ
ఏపాటలోపాడి యే మొమాటాడి
ప్రేమింప నెంత ప్రార్థించినఁగాని
లవలేశమైనను లాభింపదాయె
మనసారఁ దీయనిమాటాడు ననుచు
పంజరమ్మున పక్షి బంధింపనేల
అవ్వలిదరిలేని యాకాశమందె
తీయగాఁబాడుచుఁ దిరుగాడనిమ్ము
నాకమ్ము నరకమ్ము నాలోనెగలుగ
సుఖదుఃఖముల వేర చూచుటయేల
వలపులజ్యోతి భావమ్మున వెలుగ
దారికోసము పరితాప మేమిటికి
యెదలోనిమూర్తితో నెడబాటులేదు
తీయనిబంధమ్ము తెగిపోవదెపుడు

కాలిసంకెళ్ళతో గానమ్ము నేర్పు
పైడిపంజరముపై భ్రమయేల నాకు
దొంగమబ్బులవెన్క దోబూచులాడు
చుక్కలవెలుగుతో సొదయేల నాకు
ఈనడుకానలో నేకాంతముగను
చెట్లచేమలతోడ సెలయేళ్ళతోడ
పూలగుత్తులతోడఁ బులుఁగులతోడ
నాటలాడుచు బాట లాలపించుచును
స్వేచ్ఛగా గాలిపై విహరించుచుందు
బ్రతుకె దుఃఖం బాశపడుటె దుఃఖమ్ము
వలపె దుఃఖము ప్రాణపతియె దుఃఖమ్ము
ఏనె దుఃఖమను, నాదే దుఃఖమింక
వెలుఁగులో వెలుఁగుచు వేడుకపడుచు
లోకంబె సౌఖ్యంబులో మున్గఁగాక!

# రథయాత్ర

ఓ రొద నీవు దిగ్వదనముల్ పులకింప ననంత శాంతిలో
శాయతసమ్మ్రుకంచుఁ బ్రణయార్థులుః మార్గశిరాంబరాంబుద
చ్ఛాయల నీసువర్ణరథచక్రనినాదము లాలకించి కే
ల్గోయి నమూల్యవస్తుతతితో గుమిగూడిరి త్రోవ వెంబడిన్

తీరని యాశటన్ వగలఁ దీరెను కోరికలే పరస్పరా
హారము లా దరిద్రసమయమ్మున, దీపమె లేని నాకుటీ
ద్వారముఃముందు నీకు నిలువం బనియేమని యెంచు నాయెదన్
దూరమునుండి మెల్లమెలఁ దోచెను నీమురళీనినాదముల్

నీరథ మేగుదెంచి యిటనిల్చిన దాక్షణమే కుటీబహిః
ద్వారముచేరువం ద్వదమృతప్రభలంగని ప్రేమభాగ్యముల్
వారగ నిల్చినా నపుడు స్వర్ణరథమ్మును డిగ్గి నీవె నన్
జేరితి నేను నీకనులచిర్నగవుం గని క్రుంగిపోయితిన్

నాముఖపై ఖరిం గనుగొనం దలయెత్తితి వొక్క-మారు, ల
జ్జామథితాలసమ్ములగు జంకెనచూపుల మాటువడ్డ నా
ప్రేమమనోజ్ఞతల్ పులకరించిన వప్పుడె క్షుబ్ధమర్మమై
నామది నీపవిత్రచరణమ్ములకున్ ముడిపై చెఁజూపులన్

నీమధురాధరారుణిమ నిండిన నీయనురాగహాసముల్
నామలినాశ్రుపూరతతులం బడినప్పటి యింద్రచాపరే
ఖామణిభూష లేయెడదఁ గప్పుటచే జననాంతరామృత
ప్రేమరహస్యముల్ వెలువరించుకొనన్ మరపయ్యె నీకడన్

ఆపుటకైన నీ లోఁదవనట్టి రయమ్మున సాగిపోయె ద్యా
వాపృథివీపరీతము, భవద్విజయాంకరథమ్ము, భావనా
శ్రీపథమందె చూచుకొని సిగ్గునఁగ్రుంగి కృశించునాయెడన్
రాపులువెట్టి దుఃఖతిమిరమ్ముల మూఁతలువడ్డ నద్దెసల్

ఈవిరసంపు వార్ధ్యమున కీవెటు లెంచెదవోయటంచు నెం
తో వెఱజెంది దివ్యరథధూళిసుగంధిలమైన దుఃఖపుం
ద్రోవనె వేడియూరుపులదొంతరలం బొరలాడి చచ్చియుం
జావనియాశలం బ్రణయసాగరపారముదాకఁ జల్లితిన్

# అంకితము

నీపదమె నమ్మి యాశల నిలిపికొనిన
పడుచుప్రాయమ్ముపై జాలి పొడమదొక్కొ!
ఆరిపోవని చిరవిరహాగ్నిఁ గాలిపి
మృదుహృదయ మిట్టులేల దహింతువోయి!

పొలుపుతీరుల భేదమ్మె పొసఁగుఁగాక
హృదయపుందీయదనము గ్రహింపలేవె
విరిసినయెడంద తరగలై వెడలువలపు
లకట గాలికి వెదఁజల్ల నర్థ మగునె!

యౌవనపుఁ దీయ మెడలని తీవ కపుడె
పాపహేమంత కార్శ్య మేభంగి వచ్చె
శ్రావణము వెళ్ళిపోని యీరాగతటిని
యెండిపోవునె హృదయేశ! ఇంతలోనె

మధురమధుమాసమున గున్నమావిఁ జేరి
తీయగా నిన్ను గూర్చి గీతికలుపాడ
గళము సారించుకొన్న కోయిలకు నపుడె
సంభవించెనె శ్రావణజలదపటలి

నాదు జీవితకావ్య మేనాడు నీకు
నంకితము జేసికొంటి నాయంత నేను
నాటి ప్రేమాతురములు కన్నీటఁ గడిగి
చెరపివేయ నాతరమౌనె జీవితేశ !

# పేదబ్రతుకు

పేదబ్రతుకు నర్పించెడు భాగ్యము
లేదా యిక నీపాదదాసికిని
ప్రేమామృతసరసీమరాళినై
నీమురళీనవనీతగీతినై
పేదబ్రతుకు నర్పించెడు భాగ్యమె
లేదా యిక నీపాదదాసికిని

గాలికౌగిళులఁ దేలు పూవువలె
నీలిమబ్బుపయి వ్రాలు మెఱుపువలె
తేలిపోనికలవోలె, నీయెడఁద
పూలదండనయి వ్రేలుచు వలచుచు
పేదబ్రతుకు నర్పించెడు భాగ్యము
లేదా యిక నీపాదదాసికిని

# చకోరిక

ఈ చకోరికకు ఎన్నడో పున్నమ
ఈ చెర విడి యెపు డెగిరి సుఖించునో

ఆకులపడి రెక్కార్చు చూర్చుచును
శోకతిమిరకృశయై కలవరపడు
ఈ చకోరికకు ఎన్నడో పున్నమ
ఈ చిరవిరహ మెప్పు డవసన్నమొ

శీతామృతచంద్రాతపమున, నవ
జీవనపులకితయై, విసు వెరుగక
ప్రేమగాన మొనరించుచు, చిరసుఖ
సీమవిహారము సేయ నాశపడు
ఈ చకోరికకు ఎన్నడో పున్నమ
ఈ చెరవిడి యెపు డెగిరి సుఖించునో!

# ప్రభూ

ఈ నవవేణుదండ మిటు లేటికిఁ జెక్కెద వేల చిల్లులై
పో నొగిలింతు వం చడలిపోయితి, వ్యర్థపుటూర్పుగాడ్పులన్
గానముగాగ మార్చుటకెగా యని యిప్పుడె నే గ్రహించితిం
గాని విశీర్ణ మీహృదయనాళ మెటుల్ పలికింతువో ప్రభూ!

నీ వెడయూర్పుతావుల జనించినకమ్మదనమ్ము వ్యర్థమై
పోవకమున్నె, యీసుషిరముంగొని, తీయనిస్వప్నవాసనా
జీవనగీతముల్ విపినసీమలనైన సరే ధ్వనింపు మీ
శ్రావణకృష్ణపక్షతిమిరమ్ములు పుల్కలతో వినన్ ప్రభూ!

# నీ కో స మే

కోసుకొనుమ యీ కోమలకుసుమము
కోరి విరిసె నీకోసమె స్వామీ!

తేనెలసోనలు తీరకమునుపే
తీయనివలపులు మాయకమునుపే
కోసుకొనుమ యీ కోమలకుసుమము
కోరి విరిసె నీకోసమె స్వామీ!

విడివ రేకుగమి వడలిపోవునో
తొడిమవీడి పెనుధూళిని రాలునో
చెడునో వికసించిన మధుశోభలు
ఒడల పులకరింపొదవగ నిపుడే
కోసికొనుమ యీ కోమలకుసుమము
కోరి విరిసె నీకోసమె స్వామీ!

# పూవు

పూచినకమ్మతావులు గుబుల్కొనుచారువసంతవేళఁ బూ
జోచితసర్వవస్తువినియుక్తి నిమేషయుగప్రతీక్షతో
వేచినఁ గానరావు కనుపించెదవో యికఁ బ్రావృడంబర
శ్రీచికురాయమాణజలభృత్పటలీచటులాంధమా తమిన్

నీయనురాగముం దెలియనేరని నాహృదయమ్ము సంశయ
చ్ఛాయల నూగుచున్నది విషాదపుఁజీకటిరేకు రేకులం
దీయనివెన్నెలల్ వలచు నీకడకన్నులనవ్వులం దె స్వా
మీ! యిటు లెంతకాల ముడికింతువు ఱెక్కలురానియాశలన్

కేవల మాశ ల్లార్చి యడకించెద వీ కుసుమమ్ము మ్లానమై
పోవునొ, ధూళి రాలిపడిపోవునొ యేమొ, దళీవసంతశో
భావిభవమ్ము మాపువడఁ బ్రాయపుఁదీయనివాసనల్ నిరా
శావిషమానిలాహతి విషాదపథాల నడంగిపోవఁగన్

# అభిసారిక

రేయి రేయెల్ల కంటిపై రెప్పయిడక
వేచియున్న రాఁడాయెనే విభుఁడు చెలియ!
యీవృథాభిసరణముతో జీవితమున
మఱి లంభింపని మధువిభావరి గతించె

కోరి నూతంచు బ్రతిమాలుకొన్న యపుడు
పంతగించిన యీ మందభాగ్యకోస
మకట! యీ రేయి నాథుఁ డాయాసమునక
యరుగుదెంచునె! మనకు దురాశ గాక

బరువుచే టభిసరణానై పథ్య మింక
తీసికొనుమ సఖీ! యెద తేలి కగునొ
ఆడుదాని గభీరహృదంతరాను
రాగ మెటు సైచు నీ యగౌరవభరమ్ము

విభుని యతసీప్రసూనసన్నిభతనూవి
కాసము పదేపదే జ్ఞాపకమ్ము దెచ్చి
నాయెద దహించు నీయమునాతటమ్ము
చెలియ! సంకేతమేల చేసితివి నీవె

ముహురుపచితాశ్రుమలినకపోలయగుచు
నావలెనె యీనిశయు వెళ్ళిపోవుచుండె
అడుగుసాగదు శూన్యగృహమ్ము జేర
మానస మ్మేమొ కడు నుదాసీన మగును

తనప్రియుడు వచ్చుజాడ గట్టినద యేమొ
కనులు విప్పెను పద్మినీకాంత యపుడె
అరుణరాగావకుంఠనాంతరమునుండి
నన్నుఁగని వేకువనెలంత నవ్వె నదిగో!

చాలు నభిసరణ మ్మింకఁ జాలు సకియ!
ప్రాతరారంభపవనసంగీతమునకు
తటతరుకులాయముల శకుంతములు మేలు
కానకపూర్వమె యిలుసేరుకొందము పద

# ము క్తా వ ళి

పూవులరోజులున్ గడచిపోయె, విషాదహిమావృతాంధకా
రావిల మయ్యె నీప్రకృతియంతయు, ఆకులపాటునొంది పూ
దీవలు నాదు లేయెడదతీరున ప్రోడయిపోయె, నాటియా
జ్ఞావిధి స్వామి! నా కిపుడు జ్ఞప్తికివచ్చి భయమ్ము గొల్పెడిన్

ఈమధుమాసశోభ గతియింపకపూర్వమె పూలతోటలో
కోమలపుష్పముల్ వెదకి కోసి యమర్చిన ప్రేమదామమున్
నామెడలోనె వేయు మనినా, వపు డొక్కసుమమ్ము నైన నా
స్వామి! భవత్పదార్పణము సల్పగలేనయితిన్ విమూఢతన్

నావలె శుష్కజీవనమునన్ దురపిల్లెడి యీపవిత్రగో
దావరి పేదవడ్డనినదమ్ములతో శ్రుతిగల్పి ప్రేమరా
గావహదుఃఖగీతు లిపు డల్లుచు గ్రుచ్చుచునుంటి నొక్కము
క్తావళి నాపవిత్రనయనాంబుకణోజ్జ్వలమౌక్తికమ్ములన్

ఈసుకుమారమాల ధరియింపుము నీహృదయమ్మునందె స్వా
మీ! సుముఖమ్ములై పరిణమించు మనోజ్ఞవసంతమాససం
ధ్యాసమయాంతరమ్ముల రవంత భవన్మధురానురాగని
శ్వాసపరీమళానిలపు స్పర్శసుఖమ్ము ననుగ్రహించుచున్

# నేడు

హరిపదాంభోజదళదళాంతరములందు
చిందువారెడు కాంతిమరందలహరి
నాదరిద్రకుటీరాంగణమునఁ గ్రుమ్మ
రించెఁ జైత్రప్రభాతపరీమళములు

నీలిమంటలపొగ కెరటాలఁగురియు
కారుమబ్బులచిమ్మచీకటులఁ ద్రోవఁ
దిరుగులాడిన వేసట దీరిపోయె
నమృతసౌందర్యలోకవాతాయనాగ
తానుకూలానిలము సోకినంత నేడు

పూలచిరునవ్వులో పొంగిపోవుపొలుపు
గాలియూర్పుల చిఱుతరంగాలవలపు
చివురుజొంపాల వెచ్చనికవుగిలింత
పులుగుగొంతుకతీయనిపులకరింత
నేడె నాహృదయమ్ములో నిండిపోయె

తప్పిపోయిన స్వప్న సౌందర్యపథము
పారవైచిన చిరతర ప్రణయమురళి
వెదకికొని వచ్చినట్లు లభించె నేడు
యుగయుగమ్ముల మధువిభాతోత్సవముల
పిలుపుతోడ మోయగలేని వలపుతోడ
మురళినూదుచు నీమనోహరపథాన
సంభ్రమాశ్చర్యకరసుఖస్వప్న శాంతి
సంతతానందమయనూత్న సత్యకాంతి
పాడుకొందును తాండవమాడుకొందు
నాకుటీర మానందనందనము నేడు

# పూజాప్రసూనములు

రాలనిపూలు కోసికొని రమ్మని పంపితి వీవె యీ యుషః
కాలమునందు పెద్దయొడిగట్టి ననున్, పవమానవీచికా
జాలములందు నే వలపుజాడలఁ గట్టుచు వచ్చులోన నీ
పూలవనమ్ము గుమ్మమును మూసిరి పిల్చినఁ బల్కరెవ్వరున్

ఈపథమందు వచ్చుజను లెల్ల రెగాదిగ నన్నుఁ జూచి లో
లోపల నవ్వుచుండ, నెటులో నిలుచుంటిని వేఁగుచీఁకటిన్
మాపులువడ్డలేఁతపొగమంచు తెరల్ పులకించిపో నుషః
శ్రీపవనమ్ము లెక్కి విహరించెడు పూవులతావు లానుచున్

ఆ రవికాంతి నీలజలదావళిపైఁబడ చిత్రవర్ణశో
భారమణీయతల్ దివిని వ్రాలినపోలిక నీప్రభాతగం
భీరసుగంధశీతలసమీరము నామెయి సోకినంత వి
ప్పారెను నావిషణ్ణహృదయాన నపూర్వవిముగ్ధభావముల్

వేసవిరేల వేణువనవీథులయం దలస్ప్రచారముల్
చేసినకమ్మతెమ్మెరలచిందులలో స్ఫురియించు గానవి
న్యాసమువోలె మెల్లమెల నాచెవి సోకెను నీనిరంతర
వ్యాసితవిశ్వఘోషణరహస్యము దూరమునుండి పిల్వగన్

కాలము వెళ్ళఁబుచ్చి విధికాళులపైఁ దలమోపుకంటె నే
నేల స్వతంత్రధర్మము వహింపఁగ రా దని తోటపెన్గడిన్
గేల స్పృశింప, వింటి నొక కేకను 'మాలిక గ్రుచ్చ నెంచు ప్రే
మాలసు లీవనిం జొర నసహ్యాలు వారల కంద వీపువుల్'